నెహ్రూ బాల పుస్తకాలయం

# స్వర్గయాత్ర - ఇతర కథలు

మూలం

లీలావతీ భాగవత్

చిత్రాలు

జతీన్ దాస్

అనువాదం

వి. పాండురంగారావు



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా




ప్రథమ ముద్రణ 1970 (శక 1892)
నాల్గవ ముద్రణ 1993 (శక 1914)



ISBN 81-237-0361-9

A Trip to Heaven (Telugu)

రూ. 6.00

డైరక్టరు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్ పార్కు, కొత్త ఢిల్లీ- 110016. చే ప్రచురించబడినది.

# 1. స్వర్గ యాత్ర

అనగా అనగా ఒక రాజుగారు.

ఆ రాజుగారికో పెద్ద తోట; చాల పెద్ద తోట.

ఆ తోటను చూచుకోవడానికి కొక తోటమాలి. అతని పేరు శంకర్.

శంకర్‌కు ఆ తోటంటే ఎంతో ఇష్టం. ఆ తోటలోని చిన్న చిన్న మొక్కలను, పెద్ద పెద్ద చెట్లను ఎంతో ప్రేమగా చూచుకొనేవాడు. అతనికి పొద్దున్నుంచి రాత్రిదాకా ఆ తోటపనితో సరిపోయేది. అంత పెద్ద తోటను శుభ్రంగా చిమ్మేవాడు. చెట్లన్నిటికీ నీళ్ళు పోసేవాడు. చిన్న చిన్న మొక్కలను మరీ జాగ్రత్తగా చూచుకొనేవాడు. మట్టిని తవ్వి, మిట్టపల్లాలు లేకుండా చేసేవాడు. పిచ్చిమొక్క లన్నిటినీ పీకి పారవేసేవాడు. పువ్వులన్నిటిని జాగ్రత్తగా కోసి అంతఃపురంలోని గదులను అలంకరించడానికని మాలలు, గుత్తులు కట్టేవాడు. ఇంకా ఏమన్నా పువ్వులు మిగిలిఉంటే అమ్మకానికి బజారుకు పంపేవాడు. ఇన్ని పనులుంటే మరి శంకర్‌కు తీరిక ఎక్కడిది?

శంకర్, అతని భార్య లక్ష్మి ఒక చిన్న గుడిసెలో కాపురం ఉండేవారు. ఆ గుడిసె తోటమధ్యలో ఉండేది. గుడిసెలోనుంచే శంకర్ తోటనంతటినీ ఒక కంట కనిపెట్టి ఉండేవాడు.

ఒక రోజు రాత్రి శంకర్‌కు నిద్ర పట్టలేదు. అర్ధరాత్రి అయినా ఇంకా మేలుకునే ఉన్నాడు. లేచి పడకమీద కూర్చుండి, కిటికీగుండా బయటికి చూశాడు.

ఆశ్చర్యం! శంకర్ తన కళ్లను తానే నమ్మలేక పోయాడు. మళ్లీ చూశాడు. బయట, తోటలో ఒక పెద్ద తెలటి ఏనుగు తోటలో వచ్చి గడ్డిని మేస్తూంది.

ఇదేమి ఆశ్చర్యం! ఈ ఏనుగు ఎక్కడనుంచి వచ్చింది! అందులోనూ తెల్లని ఏనుగు! శంకర్ తెల్లని ఏనుగును ఇంతవరకు చూడలేదు.

అట్లా ఆలోచిస్తుండగా శంకర్‌కు వాళ్ళమ్మ చిన్నప్పుడు చెప్పిన దేవతల కథలు గుర్తుకు వచ్చాయి. దేవతలకు రాజు ఇంద్రుడు. ఆయన స్వర్గంలో ఉంటాడు. మంచులా తెల్లగా ఉండే ఐరావతం అన్న ఏనుగు ఇంద్రుడి వాహనం.

"ఆ! అర్థమైంది! ఇది ఐరావతమే అయిఉండాలి." అని సంతోషంతో అరిచాడు శంకర్. "ఆ స్వర్గంలో దొరికినదంతా తిని తిని విసుగెత్తిపోయి ఈ ఐరావతం కాస్తా భూమ్మీదకు వచ్చింది. నేను గనుక వెళ్ళి దాని తోకను పట్టుకుని వేలాడితినా ఆ ఏనుగు నన్ను తిన్నగా స్వర్గానికి తీసుకొని వెళ్తుంది. ఆహా! ఆ స్వర్గాన్ని కళ్ళారా, తనివి తీరా చూడవచ్చు". అని సంబర పడిపోయాడు శంకర్.

వెంటనే పక్కమీద నుంచి లేచాడు. భార్య మేలుకోకుండా, నెమ్మదిగా అడుగులు వేసుకొంటూ తోటలోకి వెళ్ళాడు. ఒక చెట్టు చాటున నిల్చొని ఏనుగును చూడసాగాడు. కావలసినంత గడ్డిని తిన్నాక ఏనుగు చెట్ల ఆకులను, పండ్లను తినసాగింది. అయినా సరే శంకర్ దాన్ని ఏమీ అనలేదు. మరి ఆ ఏనుగును కోప్పడి తరిమివేస్తే స్వర్గం చూడడం ఎలాగ?

తెల్ల తెల్ల వారు తుండగా ఏనుగు మేయడం చాలించింది. తృప్తిగా తొండాన్ని పైకెత్తి ఘీంకరించింది. ఏనుగు ఇంక బయలుదేరడానికి సిద్ధంగా వుందని శంకర్ తెలుసుకున్నాడు. చెట్టు చాటునుండి వచ్చి, గభుక్కున ఎగిరి ఏనుగు తోకను పట్టుకున్నాడు. మరొక్కక్షణం ఆలస్యం చేసివుంటే ఏనుగు తోక అందక పోయేది. అవును, ఆ ఏనుగు 'హెలికాప్టర్' లా రయ్‌మని పైకిలేచి పోసాగింది.

మరి కాస్సేపట్లో శంకర్ మేఘాలను దాటి ఇంకా పైపైకి వెళ్ళిపోయాడు. 'అయ్యో బాబోయ్! పట్టు గనక వదిలానా ఇక ప్రాణాలుండవు' అని భయపడ్డాడు శంకర్. భయంతో ఒళ్ళంతా చెమటలు పోసింది.

కాని ఎటువంటి ప్రమాదమూ లేకుండా శంకర్ క్షేమంగా స్వర్గాన్ని చేరాడు. ఐరావతం క్రిందికి దిగగానే శంకర్ దాని తోకను వదలిపెట్టి క్రింద నిల్చున్నాడు. కాస్త కళ్ళు తిరుగుతున్నట్లనిపించింది. కాని ఓ నిముషంలో

సర్దుకుంది. శంకర్ తన చుట్టూ ఆశ్చర్యంతో చూశాడు. "ఇది స్వర్గలోకపు తోట - నందనవనం అంటారే, అది కాబోలు" అనుకున్నాడు.

"ఓ యబ్బో! ఈ చెట్లు ఎంతెంత పెద్దవి! ఇంద్రుడిగారి తోటమాలి ఈ చెట్లకు ఏమి ఎరువులు వేస్తాడో మరి!"

నిజంగా అవి చాల పెద్ద చెట్లే! భూమిమీద ఉన్నవాటికి పదింత లున్నాయి. వాటి ఆకులూ, పువ్వులూ, పండ్లూ అంతే! శంకర్ ఆశ్చర్యానికి అంతులేదు రోజల్లా ఆ తోటలో తిరిగి తియ్యని పండ్లను తిన్నాడు. బలే బావున్నాయి!

సాయంకాలం ముగిసింది. చీకటి పడసాగింది. "అయ్యో పాపం! నా పెళ్ళాం లక్ష్మి, క్రింద భూమి మీద, నాకోసం కాచుకుని వుంటుంది. దానికోసం ఈ స్వర్గంనుంచి ఏదన్నా కానుక తీసుకు పోవాలి." అని శంకర్ అనుకున్నాడు. కొబ్బరి కాయంత వున్న పోక పండును, అరిటాకంత వున్న తమలపాకును తీసుకున్నాడు. ఈలోగా రాత్రి అయింది. ఏనుగు - అరిచింది. అది భూమి మీదకు వెళ్ళడానికి సిద్ధంగా వుందని శంకర్ తెలుసుకున్నాడు. పరుగు పరుగున వెళ్ళి దాని తోకను పట్టుకున్నాడు.

మరి కొద్ది నిముషాల్లో శంకర్ భూమి మీద తన రాజుగారి తోటలో దిగాడు. వెంటనే గుడిసెలోకి పరుగెత్తుకు పోయాడు. అక్కడ లక్ష్మి కాచుకొని వుంది.

"పొద్దుటి నుంచి ఎక్కడికి వెళ్ళారు" అని కోపంగా అడిగింది లక్ష్మి. "రోజు రోజంతా మీకోసం ఎదురు చూచి చూచి కళ్ళు కాయలు కాచి పోయాయి."

"కోప్పడకు లక్ష్మి!" అని బుజ్జగించి శంకర్ - "చూడు నీ కోసం ఏమి తెచ్చానో-" అంటూ స్వర్గంనుండి తెచ్చిన తమలపాకు, పోకపండూ ఇచ్చాడు.

"అయ్య బాబోయ్! ఇంత పెద్ద ఆకు, పోక ఎపుడూ చూడలేదే! ఎక్కడ నుంచి తెచ్చారండీ?" అని ఆశ్చర్యంతో అడిగింది లక్ష్మి.

"ఎక్కణ్ణుంచీ? . . . స్వర్గంనుంచి తెచ్చాను." అని శంకర్ ఆమెకు జరిగిన దంతా చెప్పాడు. మొదట ఆమె నమ్మలేదుకాని ఆ తమలపాకు, పోకపండు చూచాక - నమ్మక తప్పిందికాదు. మరి అంతంత పెద్దవి ఈ ప్రపంచంలో దొర

కవు కదా ..... కథంతా చెప్పాక శంకర్ లక్ష్మితో - "ఇదిగో ...ఇదంతా ఎవ్వరికీ చెప్పకూడదు. పరమ రహస్యంగా ఉంచాలి సుమా" అని చెప్పాడు.

"అట్లాగేలెండి! ఎవ్వరికీ చెప్పను" అంది లక్ష్మి.

ఎవ్వరికీ చెప్పను అని అనడమయితే అంది కాని లక్ష్మికి అంత గొప్ప రహస్యాన్ని ఎవ్వరితోను చెప్పకుండా దాచుకోవడం బలే కష్టమనిపించింది. మళ్ళీ ఒకసారి శంకర్ స్వర్గానికి వెళ్ళి అతి తియ్యటి, పెద్ద పండును తెచ్చాడు. ఆ తర్వాత లక్ష్మికి ఆ రహస్యాన్ని దాచుకోవడం మరీ కష్టమయి పోయింది. అయినా సరే ఎలాగో తమాయించుకుంది. శంకర్ మూడవసారి స్వర్గానికి వెళ్ళి నపుడు, ఒక అందమైన పెద్ద పువ్వును తీసుకొచ్చాడు. ఆ పువ్వు సువాసన ఘుమ ఘుమలు చాల దూరం వరకు వ్యాపించాయి. ఆ వాసన పసిగట్టిన లక్ష్మి స్నేహితురాండ్రకు కొందరికి ఆశ్చర్యం వేసింది. ఇదేమి సువాసనో తెలుసుకుందా మన్న కోరిక కలిగింది. ఒకామె లక్ష్మి దగ్గరకొచ్చి - "నువ్వు ఏదో మంచి అత్త రును వాడుతున్నట్లుంది. దాన్ని ఎక్కడినుండి సంపాదించావో చెప్పు -" అని అడిగింది. వెంటనే లక్ష్మి "అబ్బే, నేనేమీ అత్తర్ వాడడంలేదు. మా ఇంట్లో ఒక పెద పుష్పం వుంది. దాని సువాసనే అది!" అంది.

ఇంకేముంది, అసలు విషయం కాస్తా బయట పడిపోయింది. ఈ కాస్త విషయం విని ఆ స్నేహితురాలు ఊరుకుంటుందా? ఆమె ఒకటి తర్వాత ఒకటిగా ప్రశ్నలు వేసింది. లక్ష్మి అన్నిటికీ జవాబులు చెప్పింది. ఈ విధంగా కథనంతా చెప్పింది లక్ష్మి. చెప్పాక లక్ష్మి తన స్నేహితురాలిని "ఈ విషయం ఇంకెవ్వరి తోను చెప్పకేం!" — అని కోరింది.

"చెప్పన్లే" అందిగాని ఆ స్నేహితురాలు చెప్పకుండా వుండలేక పోయింది. ఆమె తనకు అత్యంత స్నేహితురాలయిన మరొకావిడకు ఈ గమ్మత్తయిన విషయం అంతా చెప్పి ఇంకెవ్వరికీ చెప్పవద్దని కోరింది. మరొకావిడ ఇంకొ కావిడకు చెప్పి "రహస్యంగా వుంచు సుమీ" అంది. ఇంకొకావిడ ప్రక్కిం టావిడకు మాత్రం చెప్పింది. ఇట్లా క్రమక్రమంగా అసలు విషయం ఊళ్ళోని ఆడవాళ్ళందరికీ తెలిసిపోయింది. ఆ ఆడవాళ్ళు ఆ రహస్యాన్ని తమ తమ

మొగుళ్ళతో చెప్పారు. ఆ విధంగా ఊళ్ళో వాళ్ళందరికీ ఈ విషయం తెలిసింది.

ఒక రోజు పొద్దున్నే ఊళ్ళోని ఆడా మగా అంతా కలిసి కట్టకట్టుకుని శంకర్ ఇంటికి వచ్చారు. వాళ్ళు శంకర్‌తో — "నువ్వు స్వర్గం వెళ్ళి వచ్చినట్లు మాకు తెలిసింది. ఈ సారి స్వర్గానికి వెళ్ళేటప్పుడు నువ్వు మమ్మల్ని నీతోపాటు తీసుకు వెళ్ళాలి —" అన్నారు.

శంకర్‌కు లక్ష్మి మీద చాలా కోపం వచ్చింది. కాని ఇప్పుడింకేమి చేయ గలడు? అంచేత వాళ్ళందరితో "సరే మీరందరూ ఇవాళ రాత్రి రాజుగారి తోటలోకి రండి — అయితే ఏ మాత్రం చప్పుడు చేయకుండా నిశ్శబ్దంగా వుండాలి." అని చెప్పాడు.

శంకర్ చెప్పినట్లు ఆ రాత్రి అందరూ రాజుగారి తోటలోకి చేరారు. నిజానికి అప్పుడా తోటలో చెట్లకన్న మనుష్యులే ఎక్కువగా వున్నారు. గాలి వీచినపుడు చెట్లకొమ్మలు కదిలాయిగాని ఆ జనం మాత్రం కిక్కురు మనలేదు. సరే, ఐరావతం వచ్చి తోటలోకి దిగనే దిగింది. వాళ్ళందరికీ బలే ఆశ్చర్యం వేసింది. కాని వాళ్ళు నోరు విప్పలేదు. అంతా నిశ్శబ్దంగా వున్నారు.

తెల్లవారు ఝామున శంకర్ వాళ్ళకు సైగ చేశాడు. చేసి, తాను వెళ్ళి ఐరావతం తోకను పట్టుకున్నాడు; లక్ష్మి శంకర్ కాళ్ళు పట్టుకుంది; లక్ష్మి కాళ్ళను ఒక స్త్రీ పట్టుకుంది; ఆమె కాళ్ళను ఆమె మొగుడు పట్టుకున్నాడు; అతడి కాళ్ళను ఇంకొకడు పట్టుకున్నాడు; అతడి కాళ్ళను అతడి పెళ్ళాం పట్టుకుంది. ఈ విధంగా ఆ ఊరివారందరూ ఒకరి కాళ్ళు ఒకరు వరుసాగ్గా గొలుసులాగ పట్టుకున్నారు. ఐరావతం పైకి లేచింది. పట్టు వదిలితే ప్రాణం ఎగిరిపోతుందని గట్టిగా పట్టుకున్నారు అందరూ. ఆ దృశ్యం చూడడానికి ఎంత బాగుండి వుండాలో — కాని ఆ వూళ్లో రాజులూ రాణులూ నిద్రపోతుండిరాయె. మిగతా వాళ్ళందరూ స్వర్గయాత్ర గొలుసులో [illegible]రాయె. కనుక ఆ వింతను చూచేవారే లేకపోయారు.

ఈ విధంగా ఆ జనాభా అంతా స్వర్గంవైపు ప్రయాణం చేస్తూ చేస్తూ వుండగా, కొసని అందరికన్న దిగువనున్న ఒకావిడకు ఒక సందేహం కలిగింది.

వెంటనే ఆమె తనకు పైన వున్న తన మొగుడిని—“స్వర్గంలో పండ్లూ, పువ్వులూ, చాల పెద్దవిగా ఉంటాయని లక్ష్మి చెప్పింది. కాని ఎంతెంత పెద్దగా వుంటాయో చెప్పలేదు. కాస్త మీ పైన వున్న మీ మిత్రుడిని అడిగి కనుక్కోండి!” అంది.

ఆ మొగుడు తనకు పైనున్న మిత్రుడినడిగాడు; ఆ మిత్రుడు తన భార్య నడగగా ఆమె తనకు పైనున్న తన స్నేహితురాలి నడిగింది. ఆ స్నేహితురాలు తన మొగుడినడిగింది. అతగాడు పైనున్న ఇంకొకడిని అడిగాడు. ఇట్లా ఆ ప్రశ్న మొత్తంమీద లక్ష్మిని చేరింది. ఆమె శంకర్‌ని అడిగింది: “స్వర్గంలో పండ్లూ, పువ్వులూ ఎంతెంత పెద్దవిగా వుంటాయీ అని అడుగుతున్నారు అందరూ—”

“కాస్సేపట్లో స్వర్గం చేరాక వాళ్ళే చూస్తారుగా!” అన్నాడు శంకర్. ఆ మాట క్రిందిదాక వెళ్ళింది. కాని ఆ కొసని ఉన్న ఆవిడ అంత తేలిగ్గా నోరు మూసుకునే ఘటం కాదు. ఉబలాటం కొద్దీ మళ్ళీ అదే ప్రశ్న వేసింది. ఆ ప్రశ్న వెళ్ళి వెళ్ళి లక్ష్మిని చేరింది. “ఏమండీ! నా స్నేహితురాలు స్వర్గం చేరేదాక ఉండలేదట. తక్షణం చెప్పండి అక్కడ పువ్వులూ పండ్లు ఎంతెంత వుంటాయో —” అని లక్ష్మి శంకరును బలవంత పెట్టింది.

ఈ మొండితనం చూచి శంకర్‌కు కోపం వచ్చింది. ఆ కోపంతో— “అక్కడ పండ్లు భూమ్మీది పండ్లకన్న పదిరెట్లు పెద్దవి. నేనారోజు తెచ్చిన పోక పండు ఇంత పెద్దదిగా లేదూ — ” అంటూ శంకర్ ఆ పోక పండు పరిమాణాన్ని చేతులతో చూపించడానికని ఏనుగు తోక వదిలిపెట్టాడు.

తర్వాత ఇంకేముంది! వరుస వరసంతా ఎత్తునుండి క్రిందకు కూలారు.

ఇక ఒక్కరయినా బతికి బయట పడితేకదా ప్రశ్నలడగటానికి!



## 2. ముత్యాల పంట

అనగా అనగా ఒక రాజుండే వాడు. ఆయన ఎంతో మంచివాడు. ఉదారగుణం గలవాడు. తన రాజ్యంలో ప్రజలందరూ సుఖంగా శాంతితో జీవించాలని ఆయన కోరుకునే వాడు. ప్రజలలో ఎవ్వరూ కూడా కష్టపడరాదని ఆ రాజుగారు ఆశించే వాడు. అపుడపుడు ఆయన మారువేషం వేసుకుని తిరుగుతూ తన ప్రజల స్థితి గతుల్ని స్వయంగా చూచి తెలుసుకునేవాడు.

ఒకసారి రాజుగారు మారు వేషంలో తిరుగుతుండగా ఒక విచిత్రమయిన దృశ్యం ఆయన కంట పడింది.

ఒక రైతు పొలం దున్నుతున్నాడు. కాని నాగలికాడికి ఎద్దుల్ని కాక ఒక ఆడమనిషి కట్టి వుంది! జంతువు చేసే పనికి మనిషిని ఉపయోగించడం చూస్తే ఎవరికన్నా కోపం వస్తుంది. రాజుగారికయితే రక్తం ఉడికిపోయింది.

"ఏమిటి నువ్వు చేస్తున్నపని? ఈ ఆడమనిషి చేత నాగలి లాగిస్తున్నావే? నీ వద్ద ఎద్దులు లేవా?" అని కోపంగా ఆ రైతును అడిగాడు రాజు.

ఆ రైతు ఏమీ తొణక్కుండా "ఆమె నా పెళ్ళాం" అన్నాడు.

"పెళ్ళామయితే మాత్రం ఇంత హీనంగా బానిసలాగా, జంతువులాగా చూడడమా?" అని రాజు గద్దించాడు.

అందుకు ఆ రైతు ఇట్లా జవాబు చెప్పాడు. "మీకేమండీ గుర్రాలెక్కి తిరిగే మహారాజులు. మీరు ఏమన్నా మాట్లాడవచ్చు. కాని బీదరికం గురించి మీకేమి తెలుసు. నేను నిరుపేదను. దరిద్రం కొద్దీ నా ఎడ్లజతను అమ్మేశాను. మరి పొలాన్ని ఎట్లాగో ఒకలా దున్ని నాలుగు గింజలు పండించకపోతే గంజి తాగే

దెట్లాగు? అందుకనే నా భార్యను నాగలి లాగమన్నాను. ఆమె మారు మాట్లాడ కుండా లాగుతూంది.''

ఈ సమాధానం రాజుగారికి సంతృప్తికరంగా లేదు. ''ఇదిగో చూడు! నువ్వు చెప్పింది నాకు నచ్చలేదు. ఇట్లా ఒక జంతువు స్థానంలో ఆడదాన్ని వాడడం చాలా అమానుషం. నేను నీకు ఎద్దుల్ని కొనుక్కోవడానికి డబ్బి లిస్తాను. ఆమెను నాగలి నుంచి విడిపించు—'' అన్నాడు రాజు.

ఇది విని రైతుకు కోపం వచ్చింది. ''నువ్వెవరయ్యా నన్ను ఆజ్ఞాపించ డానికి....నా చిత్తం వచ్చినట్లు చేసుకుంటాను ఫో!--నీ దగ్గర డబ్బు తీసు కోవడానికి నేనేమన్నా భిక్షగాడి ననుకున్నావా?'' అన్నాడు.

అబ్బే, వీడితో అరిస్తే లాభంలేదు — అనుకుని రాజు నెమ్మదిగా చెప్పాడు. ''బాబూ! నా మాట విను! నా చెల్లెలిని విడిపించు.''

రైతు ఎగతాళిగా నవ్వాడు.... ''ఓయబ్బో! చెల్లెలట చెల్లెలు! చెల్లెలిమీద అంతోటి ప్రేమగల అన్నవయితే నువ్వు కాడి క్రిందికి రా రాదూ!'' అన్నాడు.

నిజంగానయితే ఒక దేశపురాజుతో ఎవరన్నా ఈ విధంగా మాట్లాడితే ఆ రాజు వాడి తల కొట్టేయించేసేవాడు. కాని ఈ రాజుకు ఆ స్త్రీ మీద అపార మయిన దయ కల్గింది. కనుక ఆమెకు కష్టం తప్పించాలి అన్న కోరికతో రైతు చెప్పినదానికి ఒప్పుకున్నాడు. ఆ నాగలి కాడిని తన మెడకు తగిలించుకున్నాడు. అప్పుడా రైతు తన భార్యను విడిపించాడు. ఆమె 'అమ్మయ్య' అనుకుంది. అప్పటినుండి రాజుగారు ఆ నాగలిని లాగసాగాడు. కొన్ని గంటలకు ఆ పొలం దున్నడం అయిపోయింది. రాజుగారు వెళ్ళిపోయాడు. కాని రాజుకు అట్లా కష్టపడి పనిచేయడం అలవాటులేదు. అందువల్ల రాజుగారు దున్నినంతమేరా నేలచుట్టు పడిపోయింది. అందుచేత ఆ భాగంలో ధాన్యం సరిగ్గా రాలేదు. అంతేకాదు, వచ్చిన పంటలో కూడా చిన్న చిన్న కంకులు పడ్డాయి.

అప్పుడు రైతు పెళ్ళాంతో - ''చూచావా నీ అన్నయ్యగారు చేసిన సాయం! ఒళ్ళువంచి దున్నితేనా? ఈ కంకులు చూడు ఎట్లా ఏడిచాయో -'' అన్నాడు.

కాని ఒక గమ్మత్తు జరిగింది.



ఆ పైరును కోస్తుండగా ఆ మూల వున్న చిన్న చిన్న కంకులలో ధాన్యపు గింజలు కాకుండా అందమైన ముత్యాలు కనుపించాయి. రైతుకు రైతు భార్యకు బలే ఆశ్చర్యం వేసింది.

అప్పుడు రైతు భార్య చెప్పింది. "చూదారా మరి? తొందరపడి మా అన్నయ్యను నానా మాటలూ అన్నారు. మా అన్నయ్య ముత్యాల పంట నిచ్చాడు!"

రైతుకు పశ్చాత్తాపం కల్గింది, తన తప్పు ఒప్పుకున్నాడు. "నిజమేనే.... మీ అన్నయ్య నిజంగా ఏదో ఇంద్రజాలం చేశాడు. అతడికి ఆ విద్యలన్నీ తెలుసు కాబోలు. లేకపోతే ఈ కంకులలోకి ముత్యాలు రావడం ఏమిటి? అయినా ఈ

ముత్యాలు మనవికావు. ఇవి ఎవరి కష్టం వల్లనయితే వచ్చాయో అతడికి చెందాలి. అతడికే ఇచ్చేద్దాం వీటిని –'' అన్నాడు.

అతడి పెళ్ళాం నవ్వింది. ''ఇస్తారూ? ఎవరికిస్తారు, ఎట్లా ఇస్తారు? పాపం అతడి ఊరూ పేరూ ఏమన్నా కనుక్కున్నారా? అతడెక్కడ వున్నాడో ఏమో?''

''నిజమే! అతడెక్కడ వుంటాడో మనకు తెలియదు. అయినా ఈ ముత్యాలను మనం ఉంచుకోకూడదు. ఇవి మనవి కావు. కనుక పద, పోయి రాజుగారికిచ్చేద్దాం వీటిని –'' అన్నాడు రైతు.

''సరే'' – అంది పెళ్ళాం. ఆ ముత్యాలను మూట కట్టారు. ఆ మూటలను భద్రంగా మోసుకుంటూ వెళ్ళి రాజుగారి దర్బారు చేరారు.

లోపల దర్బారులో రాజుగారు సింహాసనంమీద కూర్చుని వున్నారు. ఆయనకిటూ, అటూ మంత్రులూ, సామంతులూ, బారులు తీర్చి కూర్చుని వున్నారు.

రైతు, అతడి పెళ్ళాము భయభక్తులతో నడిచి వెళ్ళి రాజుగారి ఎదుట తలలు వంచి నమస్కారం చేసి ఇద్దరూ ఒక్కసారిగా తలలెత్తి ''మహారాజా! మేము...'' అన్నారంతే. వారినోళ్ళ వెంట మూడో మాట రాలేదు. వారు వెంటనే – తమ పొలంలో కాడిని మెడకు తగిలించుకుని దున్నిన మనిషి ఈయనే – అని గుర్తించారు. వారికి మతి పోయినంత పనయింది. నోట మాట రాలేదు. కాస్సేపటికి రైతు తడబడుతూ చెప్పాడు. ''మహాప్రభూ! పొరబాటయింది మన్నించండి! ఏలిన వారని తెలియక తమచేత పొలం పని చేయించాను. నన్ను క్షమించండి మహారాజా!'' అంటూ వంగి రాజుగారి పాదాల మీద తల నుంచాడు.

రాజుగారు ఆ రైతు దంపతులను గుర్తించాడు. చిరునవ్వుతో చెప్పారు. ''ఫరవాలేదు, లే! నువ్వు క్షమాపణ కోరనక్కరలేదు. నీ వలననే నేను నా రాజ్యంలో పేదవారి జీవితం గురించి తెలుసుకో గలిగాను. నీకు ఏదో కాస్త సాయపడినందుకు నాకు సంతోషంగా వుంది.''

రైతు తాము తెచ్చిన మూటను ఆయన పాదాల వద్ద వుంచి, ''మహారాజా! నా పొలంలో ఏలినవారు దున్నినచోట పండిన ముత్యాలు ఇవి. ఇవి

మీవి. దయచేసి స్వీకరించాలి" అన్నాడు. కాని రాజు అందుకు ఒప్పుకోలేదు.

"ఆ ముత్యాలు నీ పొలంలో పండాయి. నువ్వు కష్టపడి నందుకు ఫలంగా దేవుడు వాటిని నీకిచ్చాడు. అవి నీవే - నువ్వే తీసుకో - " అన్నాడు రాజు.

కాని రైతు ఆ ముత్యాలను తీసుకోలేదు. "మహారాజా! ఈ ముత్యాల పంట మీ దయా ధర్మాల వల్ల పండింది. నా క్రౌర్యం వల్ల కాదు. ఇవి మీవే." అన్నాడు.

ఆ రైతు నిజాయితీ చూచి రాజుకు సంతోషం కలిగింది. ఆ మూటను చేతి లోకి తీసుకుని, సింహాసనమునుండి లేచి, క్రిందకు దిగివచ్చి, దానిని రైతు భార్యకు ఇచ్చి - "నువ్వు నా చెల్లెలివని ఆ నాడే అన్నాను కద. ఇది నీ అన్నయ్య నీకిస్తున్న కానుక. తీసుకో. వద్దనకు–" అన్నాడు.

ఆ మాట విని రైతుగాని రైతు పెళ్ళాంగాని ఇంకేమీ మాట్లాడలేక పోయారు.

వారా ముత్యాల మూటను తీసుకుని రాజుగారికి దండాలు చెప్పి ఇంటికి వెళ్ళారు. చాలాకాలం పాటు సుఖంగా జీవించారు.



## 3. తెలివి గల వ్యాపారి

పూర్వం కాశీనగరంలో వివేక్, శంకర్ అని ఇద్దరు వ్యాపారస్థు లుండేవారు. వివేక్ తెలివిగల వాడు. ఎపుడు ఏది ఎట్లా చేయాలో తెలిసిన వాడు. అందు వలన అతడికి వ్యాపారంలో బాగా లాభాలు వచ్చాయి. అతడు ధనవంతు డయ్యాడు. కాని శంకర్‌కు అటువంటి తెలివిలేదు. కాని శంకర్‌కు మాత్రం తనకు అన్నీ తెలుసునన్న గర్వం వుండేది.

దూరంగా వున్న ఇతర నగరాలలో వ్యాపారం చేయాలి - అని ఒకనాడు శంకర్ నిశ్చయించుకున్నాడు. ఎన్నో ఖరీదయిన సరకులను కొన్నాడు. వాటి న్నిటినీ మోసుకు వెళ్ళడానికి అయిదు వందల ఎద్దు బండ్లను సిద్ధం చేసుకున్నాడు. ఈ సంగతి వినగానే శంకర్ "నేను కూడా ఇట్లాగే దూరనగరాలలో వ్యాపారం చేస్తాను. వివేక్ కన్న ఎక్కువ లాభాలు సంపాదిస్తాను" అనుకున్నాడు.

కాని శంకర్ వద్ద డబ్బులేదు. అప్పు తీసుకున్నాడు. సరకులన్నీ కొన్నాడు. అయిదు వందల ఎద్దు బండ్లను అరువుగా సంపాదించాడు. ఆ బండ్ల మీద సరుకు లను అమర్చాడు.

వివేక్ ఇదంతా విన్నాడు. అతడికి చింత కలిగింది. ఒక మనిషితో కబురు పెట్టి శంకర్‌ను పిలిపించాడు. శంకర్‌తో ఇలా చెప్పాడు: "చూడు శంకర్! మనం ఇద్దరమూ ఒకే బాట మీద వెళ్ళాలి. మరి ఆ బాట బొత్తిగా బాగులేదు. ఒక్కసారిగా వేయి బండ్లు దానిమీద పోలేవు. అదీగాక దారిలోని గ్రామాలవాళ్ళు మన అందరికి ఒక్కసారిగా తిండి, నీరు, వుండడానికి వసతి కల్పించడం చాల కష్టం అవుతుంది. కనుక మనం ఇద్దరము ఒక్కసారిగా కాక విడివిడిగా వెళ్ళితే

బాగుంటుంది. కనుక నువ్వు ముందుగా వెళ్తావా లేక నన్ను మొదట వెళ్ళ మంటావా ?''

శంకర్ ఆలోచించాడు. ''నేను ముందు వెళ్ళితే బాట బాగుంటుంది. నా ఎద్దులకు దారి పొడుగునా, కావలసినంత పచ్చిగడ్డి దొరుకుతుంది. నాతో వచ్చే వారికి గ్రామాల నుండి అన్ని సౌకర్యాలూ లభిస్తాయి. ఆ దూరంగా వున్న పట్టణాలకు నేను మొదట చేరుతాను గనుక నా సరకులు గబగబ అమ్ముడు పోతాయి.''

వివేక్‌కు కూడా ఇటువంటి ఆలోచనే కలిగింది కాని అతడు తొందరపడి



ముందు వెళ్ళ దలచుకో లేదు. కాని శంకర్ మాత్రం "నేనే ముందు వెళ్తాను" అని బయలుదేరాడు.

శంకర్ యొక్క అయిదు వందల బండ్లూ బయలు దేరాయి. రా నున్న లాభాల గురించి ఆలోచిస్తూ, పాటలు పాడుకుంటూ వెళ్తున్నాడు శంకర్. కాని వాళ్ళవూరు విడిచి కొంత దూరం వెళ్ళాడో లేదో పెద్ద చిక్కు వచ్చి పడింది. ఆ బాట అంతా పాడుపడి వుంది. రాళ్ళతో, గతుకులతో నిండి వుంది. అప్పుడు వాళ్ళు మొదట ఆ బాటనంతా బాగుచేశారు. ఆ తర్వాతనే వాళ్ళ బండ్లు ముందుకు పోగలిగాయి. ఆ బాట బాగు చేయడంలోనే శంకర్ మనుష్యులు బాగా అలసి



పోయారు. బాట బాగుచేయడంలో ఆ చుట్టు ప్రక్కల గ్రామాలవారు సాయ పడ్డారు. కాని వారు చేసిన పని కోసం వారికి తిండి పెట్టవలసి వచ్చింది. కనుక శంకర్‌కు గ్రామాల వారినుండి ఆహారం లభించడం అటుంచి శంకర్ దాచివుంచు కున్న ఆహారాన్ని ఆ గ్రామస్తులకు పంచి పెట్టవలసి వచ్చింది.

"పోతే పోయిందిలే, బాట బాగుపడింది! ఇంక నా బండ్లు చకచక ముందుకు సాగుతాయి." అనుకున్నాడు శంకర్. కాని అట్లా జరగలేదు. ఆ బాట వెంబడి కొంత దూరం వెళ్లేసరికి దట్టమైన అడవి వచ్చింది. ఆ అడవిలోని చెట్లన్నిటినీ కొట్టి దారి చేసుకోవలసి వచ్చింది. ఈలోగా పులులు, సింహాలు వచ్చి ఎన్నో ఎడ్లను చంపాయి, మనుష్యులను గాయపరిచాయి. శంకర్ మనుష్యులు బాగా అలసి పోయారు. వాళ్ళ ఉత్సాహం తగ్గిపోయింది. "వెనక్కు పోదాము" అన్నారు వాళ్ళు.

కాని శంకర్ "తొందర పడకండి. అదుగో అటునుండి ఒక బండి వస్తూంది. వారి నడిగితే - అటువైపు బాటల, ఊళ్ళ సంగతి తెలుస్తుంది. అది తెలిశాక ఒక నిర్ణయానికి వద్దాము" అన్నాడు.

శంకర్ చెప్పినట్లు ఒక పెద్దబండి ఎదుటి వైపు నుండి వచ్చింది. ఆ బండిని తెల్లటి ఎద్దులు లాగుతున్నాయి. ఆ బండిని తోలుతున్న వాడూ, అందులో కూర్చున్నవారూ వింత వేషంలో వున్నారు. వారు తడి బట్టలు ధరించి వున్నారు. తెల్ల తామర పువ్వుల దండలు వాళ్ళ మెడలలో వ్రేలాడు తున్నాయి.

వారిని శంకర్ "అయ్యా! మీరు దాటి వచ్చిన ఆ ఊళ్ళను గురించి చెప్పండి. అక్కడ తిండీ నీరూ బాగా దొరుకుతున్నాయా?" అని అడిగాడు.

"అక్కడ నీటికేమీ కొరత లేదు. బాగా వర్షాలు కురిశాయి. మా బట్టల్ని చూడండి ఎట్లా తడి తడిగా వున్నాయో! మా బండి చక్రానికి చూడండి ఎంత బురద అంటుకుని వున్నదో. అటువైపు పొలాల నిండా పంటలు మా బాగా పండాయి," అన్నాడు ఆ బండిని నడుపు తున్నవాడు. అతడు శంకర్ వాళ్ళు కుండల నిండా నీరునింపుకొని మోసుకు పోతుండడం చూచి విరగబడి నవ్వాడు.

"అయ్యో రామ! అటు వైపు వానలు కురిసి కావలసినంత నీరు దొరుకు

తుంటే ఇక్కడ నుండి మీరు నీరు మోసుకు పోతున్నారా ? వృధా ప్రయాస! అనవసరంగా మీ ఎద్దుల చేత నీళ్ళ కుండలు, బస్తాలు మోయించకండి. ఆ నీరు, కుండలు, గడ్డి ఇక్కడ పారవేసి పొండి.'' అన్నాడు బండివాడు.

''వీడు చెపుతున్నది నిజమే'' అని శంకర్ తమ దగ్గరున్న నీటిని, తిండి వస్తువులను పారవేయించాడు. ఆ బండి వాళ్ళు వెళ్ళిపోయారు. శంకర్ యాత్ర మళ్ళీ మొదలయింది.

బరువు బాగా తగ్గింది గనుక బండ్లు చకచక పోసాగాయి. ''ఇదుగో ఇంకాస్త దూరంలో మంచినీరు, పంట పొలాలూ కనబడతాయి'' అనుకుంటూ శంకర్ ముందుకు సాగాడు. కాని ఎంత దూరం వెళ్ళినా అటువంటిదేమీ కనబడ లేదు. పైపెచ్చు భూమి క్రమక్రమంగా పొడి పొడిగా, బెట్టగా, ఎండిపోయి కనపడసాగింది. ఆఖరుకు వారు ఒక ఎడారిలోకి ప్రవేశించారు.

ఎడారిలో తిండిలేక నీరు లేక మనుష్యులు, ఎద్దులు చావు పాలయ్యారు. చివరకు మిగిలిన కొద్ది మందీ అరచేత ప్రాణాలు పట్టుకుని బయట పడ్డారు. ఇంతలో పెద్ద దొంగల ముఠా వచ్చి మీద పడ్డది. ఎద్దులను చంపి వాటి మాంసం తిన్నారు. శంకరూ, మరి కొందరూ చేతనయినన్ని వస్తువులతో పారిపోయారు.

చిక్కి సగమై వారు ఒక వూరు చేరారు. తమ దగ్గర వున్న కొద్ది వస్తువులను అమ్మారు. వారి అవస్థ చూచి ఆ వూరి వ్యాపారులు చాల తక్కువ ధరలకు బేరమాడి ఆ వస్తువులను కొన్నారు.

ఈ విధంగా డబ్బును, మనుష్యులను కోల్పోయి నష్టంతో నిరాశతో వెనక్కు వచ్చాడు తెలివి తక్కువ శంకర్.

సరిగ్గా అప్పుడే తన అయిదువందల బండ్లతో వ్యాపార యాత్రమీద బయలు దేరుతున్నాడు వివేక్. శంకర్‌ను చూచి ''తన తెలివి తక్కువతనానికి తగిన ప్రాయశ్చిత్తం జరిగింది.'' అనుకున్నాడు.

వివేక్ వాళ్ళూ వెళ్తున్నారు: శంకర్ వాళ్ళు పడ్డ కష్టాల ఫలితంగా మంచి బాట ఏర్పడింది. అడవి కూడా బాగుపడింది. దుష్ట మృగాలన్నీ దూరంగా పారి పోయాయి. ఇంతలో ఎదుటి వైపు నుండి ఎవరో రాసాగారు. వాళ్ళు దొంగలు

వివేక్ వెంటనున్న బండ్ల మీద వున్న నీటి కుండలను చూచి వాళ్ళు నవ్వారు. "మేము వచ్చిన ఆ వూళ్ళో నీరూ తిండీ పుష్కలంగా దొరుకుతున్నాయి. మీరిక్కడ నుంచి చచ్చిచెడి మోసుకు పోవడం దండగ. వాటిని పారవేసి హాయిగా పొండి" అన్నారు. కాని వివేక్ వారి మాటలను వినలేదు.

"వీరి మాటలమీద నమ్మకం కుదరలేదు. ఆ పైన భూమి ఎండి పోయినట్టుంది, వీళ్ళ బట్టలు తడిగా ఉన్నాయి. వీళ్ళ మెడలలో తామర పువ్వుల దండలున్నాయి, నిజమే కాని వర్షం పడ్డ సూచన లేమీ కనపడ్డం లేదు. ఆకాశంలో మబ్బులు కూడా లేవు. వీళ్ళు మనల్ని మోసం చెయ్యాలని చూస్తున్నారు." అని వివేక్ తనవారితో అన్నాడు.

యక్షుడి మాటలను పెడచెవిని పెట్టి తన వారితో ముందుకు సాగాడు వివేక్. కాస్త దూరం తర్వాత ఎడారిలోకి ప్రవేశించారు. తిండి నీరు పారవేయ కుండా జాగ్రత్త పడ్డారు గనుక ఎడారి గుండా ఎట్టి ఇబ్బందీ లేకుండా ప్రయాణం చేశారు.

ఎడారి తర్వాత పట్టణాన్ని చేరారు. తాజాగా అక్కడి ధరవరలను తెలుసు కున్నారు. వివేక్ తాను తెచ్చిన సరకులను మంచి ధరలకు అమ్మగలిగాడు అతడు బాగా లాభం సంపాదించి, సంతోషంగా తన వూరు చేరాడు.





## 4. ప్రసాదం

దక్షిణదేశంలోని ఒక వూళ్ళో ఒక పేద రైతుండేవాడు. అతడి భార్య చనిపోయింది. ఆ రైతుకు ఉమ, గోపాల్ అని ఇద్దరు పిల్లలు మిగిలారు. ఉమకు ఎనిమిదేళ్ళు; గోపాల్ పసిపాప. తల్లిలేని ఆ పిల్లలను ఆ రైతు జాగ్రత్తగా పెంచుతుండేవాడు. ఉమ చాలా మంచి పిల్ల. తమ్ముడిని అమ్మవలె చూచుకునేది. ఉమను చూచి అతడు మురిసిపోయేవాడు.

కొన్ని సంవత్సరాల తర్వాత ఆ రైతుకూడా మరణించాడు. ఆ పిల్లలిద్దరూ అనాధలు అయ్యారు. కాని ఉమ తన వయసుకు మించిన వివేకము గల పిల్ల. తండ్రి మరణానికి ఆమె ఎంతో దుఃఖించింది. కాని తనకన్న చిన్న వాడయిన తమ్ముడికోసం ఆమె తన దుఃఖాన్ని దిగమ్రింగి వాడిని సముదాయించింది. ఇప్పుడు గోపాల్‌కు తల్లయినా, తండ్రయినా తానే కద!

ఉమకు ఎన్నో సమస్యలు వచ్చి పడ్డాయి. వాళ్ళ పొలాన్ని ఆమె సాగు చేయవలసి వచ్చింది. తాను పొలంలో పనిచేయడానికి వెళ్ళితే తమ్ముడిని ఎవరు చూచుకుంటారు? చుట్టుప్రక్కల వారిని సాయంకోరింది. వాళ్ళందరికీ ఆమె అంటే ఇష్టం గనుక వారు సాయం చేశారు. వారి సహాయంతో ఆమె పొలం పనులన్నీ చేసుకుని, మంచి పంట పండించింది. తనకు, తమ్ముడికి కావలసినంత డబ్బు సంపాదించ గల్గింది.

కొన్నేళ్ళయ్యాక, గోపాల్ పెద్దవాడయ్యాడు; ఆ బడిలో అతడి చదువు ముగిసింది. అపుడతడు ఉమతో — "అక్కా! నువ్వు నాకోసం ఎన్నో కష్టాలు భరించావు. బదులుగా నేను నీకేమి చేయగలను! నువ్వెప్పుడో పెళ్ళి చేసికొని

నీ కాపరం నువ్వు చేసుకోవలసిన దానివి. కాని అమ్మాయి పెళ్ళి అంటే మాటలా! బోలెడంత డబ్బు కావాలి. మరి అంత డబ్బు నేను ఎలా తేగలను? కావలసినంత డబ్బు సంపాదించకపోతే నీ పెళ్ళి ఎలా జరుగుతుంది?'' అంటూ దిగులుపడ్డాడు.

కాని ఉమ దిగులు పడలేదు.

ఆ వూరిలోనే ఒక అందమైన యువకుడుండే వాడు. అతడు చాల రోజుల నుండి ఉమను పెళ్ళాడుదామని కోరుతున్నాడు. అతడొకరోజు వాళ్ళింటికి వచ్చి, గోపాల్‌తో తన కోరిక చెప్పాడు. తనకేమీ కట్నాలు కానుకలు వద్దన్నాడు. అతడూ పేదవాడేగాని మంచిగుణాలు గలవాడు. అంచేత అతడంటే గోపాల్‌కు ఇష్టం కలిగింది. ఉమకూడా ఈ సంబంధానికి ఒప్పుకుంది. పెళ్ళి జరిగింది.

పెళ్ళి తర్వాత ఉమ తన భర్త ఇంటికి వెళ్ళిపోతూ గోపాల్‌ను ప్రక్కకు పిలిచింది. కండ్లలో నీరు నిండుతుండగా ఆమె "తమ్ముడూ! ఇంకొన్ని రోజులలో నువ్వూ ఒక ఇంటివాడివి అవుతావు. ఒక చక్కటి చుక్క నీ భార్య అవుతుంది. కాని ఒక్క విషయం మాత్రం మరువకు. శ్రావణమాసం మొదటి శుక్రవారం నాడు వరలక్ష్మిపూజ చేయటం మనింటి సాంప్రదాయం. ఆ వరలక్ష్మి దేవే మనలను ఇన్నాళ్ళు చల్లగా చూచింది. ఆ తల్లిని మనం ఎప్పుడూ మరువ రాదు. నీ భార్య ఈ ఇంట్లోకి వచ్చాక మనింటి అలవాటు ప్రకారం, వరలక్ష్మి పూజ చేయిస్తానని మాట ఇవ్వు'' అని అడిగింది. అలాగే ప్రమాణం చేశాడు గోపాల్.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. గోపాల్ కష్టపడి వ్యవసాయము చేశాడు. ఏ యేటికాయేడు అతని పంట హెచ్చుతూ వచ్చింది. అతడు కొద్ది కొద్దిగా డబ్బు మిగల్చసాగాడు. ఆ వూళ్ళోనే వున్న ఒక డబ్బుగల రైతు కూతురయిన కమలను గోపాల్ పెళ్ళాడాడు. ఆ పెళ్ళి బ్రహ్మాండంగా జరిగింది.

పెళ్ళయిన కొన్ని నెలలకు శ్రావణ మాసం వచ్చింది. గోపాల్‌కు తాను అక్కయ్యకు చేసిన వాగ్దానం గుర్తుకు వచ్చింది. కమలతో వరలక్ష్మి పూజ గురించి చెప్పాడు.

ఇద్దరూ కలిసి పూజ ఘనంగా చేయాలని నిశ్చయించారు. కాని కమల ఒక షరతు పెట్టింది. "దయచేసి ఈ పూజకు మీ అక్కయ్యను మాత్రం పిలవకండి. వాళ్ళు పేద వాళ్ళు. ఆమె మాసిన చీరెతో గంపెడు పిల్లలతో వస్తే నేను భరించ లేను. మిగతా పేరంటాళ్ళకు, మా వాళ్ళకు మన బంధువులింత దరిద్రులని తెలిస్తే నాకు అవమానంగా వుంటుంది."

గోపాల్ మనస్సు చివుక్కు మంది. కాని అంపగత్తె, ధనవంతురాలు అయిన తన పెళ్ళాం మాటకు ఎదురాడలేక పోయాడు. అతడు ఉమను పూజకు రమ్మని పిలువలేదు.

శ్రావణ శుక్రవారం వచ్చింది. వరలక్ష్మీపూజ చాల ఘనంగా సాగుతూంది. ఇల్లంతా తోరణాలతో, పువ్వుల సువాసనలతో, ధూప దీపాలతో వెలిగి పోతూంది. వంట వాళ్ళు తయారుచేస్తున్న రకరకాల పిండి వంటల ఘుమఘుమలు వంటింటి నుంచి వస్తున్నాయి. అతిథులు, పేరంటాళ్ళు వస్తూ పోతున్నారు. వచ్చినవారి మీద పమిడి పన్నీటి చెంబుతో పన్నీరు చిలకరించి, పువ్వులతో స్వాగతం చెబు తున్నారు. వారికి పండ్లు, పిండి వంటలు, కొబ్బరికాయలతో తాంబూలా లిస్తు న్నారు.

ఈలోగా అనుకోని సంఘటన ఒకటి జరిగింది. ఉమ గుమ్మంలోకి అడుగు పెట్టింది. ఆ పేదరాలిని చూడగానే కమల మొహం పాలిపోయింది. కమల చేతిలో అప్పుడొక పెద్ద వెండి గిన్నెవుంది, దానిలో నుండి ప్రసాదాన్ని తీసి ఆమె అందరికీ పంచి పెడుతూంది. ఉమ సంతోషంతో ముందుకువచ్చి, గిన్నెలో నుండి కొంత ప్రసాదం తీసుకుంది. కమలను కౌగలించుకుని "కమలా! ఎంతో బాగున్నావు నువ్వు ....గోపాల్ ఏడీ? నాకిచ్చిన మాట నిలబెట్టుకున్నాడు. అయినా ఇంత హడావిడిలో నన్ను పిలవడం మర్చిపోయారు. నేనేమీ పరాయి దాన్నా? నా తమ్ముడి ఇంటికి రావడానికి నాకు ఆహ్వానాలు ఎందుకులే?" అంది ఉమ. తన చుట్టూవున్న ధనికులైన ఆడవాళ్ళందరూ మాట కూడా మాట్లాడకుండా తన్నే చూస్తున్నారని, తన మాటలే వింటున్నారని, చాటుగా ఎగ తాళిగా నవ్వుకుంటున్నారని ఆమె గమనించలేదు. కమలకు కోపం వచ్చింది.



అప్పుడే అటు వచ్చిన గోపాల్‌కు తల కొట్టేసినట్లనిపించింది.

ఇదే విధంగా ఏడేండ్లు జరిగింది. ప్రతి సంవత్సరమూ కమల వరలక్ష్మీపూజ ఘనంగా చేసేది. వందలకొలదీ అతిథులు వచ్చేవారు: విందులారగించేవారు. కాని ఉమను పిలిచేవారు కాదు. అయినా ఆమె మాత్రం తప్పక వచ్చేది. తన

పాతచీర కట్టుకునే ఉమ వచ్చేది. ప్రసాదాన్ని ఒక అరిటాకుమీద తీసుకునేది. చిరునవ్వుతో గోపాల్‌తో, కమలతో మాట్లాడి వారి నాశీర్వదించి వెళ్తుండేది. ఆమెలో ఏమాత్రం కోపంగాని, ద్వేషంగాని, ఈర్ష్యగాని వుండేదికాదు. కాని ఇదంతా గోపాల్‌కు, కమలకు చాల ఇబ్బందిగా వుండేది.

కాని ఎవరి అదృష్టం ఎట్లావుంటుందో ఎవరు చెప్పగలరు? ఉమ మొగుడు ఇన్ని ఏళ్ళనుండీ చిన్న వ్యాపారంచేస్తూ కష్టపడుతూ వుండేవాడు. ఉమకు కష్టాలనెదుర్కోవడం ఉన్నదానితో తృప్తిపడడం చిన్నప్పటినుంచి అలవాటు కనుక వారిల్లు సంతోషంతోనే నిండివుండేది. ఎట్టకేలకు అదృష్టం వారిని వరించింది. అతనికి వ్యాపారంలో పెద్దలాభం వచ్చింది. ఆ లాభంనుండి ఇంకోలాభం వచ్చింది. ఇలా లాభంమీద లాభం రాగా ఉమ భర్త ధనవంతుడయ్యాడు. ఇప్పుడు ఉమ ఒక పెద్ద ఇంటికి మారింది. ఆమెకు ఖరీదయిన చీరలు, నగలు వచ్చాయి. దాసదాసీజనం ఏర్పడ్డారు. ఆమె తిరగడానికి ఒక చక్కటి గుర్రపు బండి వచ్చింది.

గోపాల్, కమల ఉమకు వచ్చిన ఐశ్వర్యం గురించి విన్నారు. ఆసారి శ్రావణ మాసంలో వరలక్ష్మి పూజకు ముందుగా కమల భర్తతో "ఉమ ఇంటికి వెళ్ళి ఆమెను పూజకు రమ్మని పిలిచిరండి. వెళ్ళేటప్పుడు ఉత్త చేతులతో వెళ్ళకండి. పువ్వులు, కొబ్బరికాయలు, పిండివంటలు తీసుకు వెళ్ళండి. ఎంతయినా ఆమె మీ అక్కయ్య కదా-!" అంది. భార్య మాటకు జవదాటని గోపాల్ ఆ విధంగానే ఉమ వాళ్ళింటికి వెళ్ళి ఉమను పూజకు రమ్మని పిలిచాడు. ఉమ తమ్ముడిని ఎప్పటివలెనే ఆదరణతో చూచింది.

వరలక్ష్మి పూజ చేసే రోజు వచ్చింది. అతిథులు రాసాగారు. మంత్రాలు, పూజ సాగుతున్నాయి. పువ్వుల అగరువత్తుల ఘుమఘుమలు ఇల్లంతా వ్యాపిస్తున్నాయి. హడావిడిగా వుంది. హఠాత్తుగా ఒక చక్కటి గుర్రపు బండి వచ్చి గుమ్మం ముందు ఆగింది. అందరూ మాటలు కూడా మానేసి గుమ్మం వైపు చూడసాగారు. ఎవరు ఆ వస్తున్నది? బండి ముందువైపు నుండి ఒక సేవకుడు దిగి వచ్చి బండి తలుపు తెరిచాడు. బండిలో నుండి ఒక స్త్రీ దిగింది. ఆమె పట్టు

చీర, నగలు ధగధగ మెరిసిపోతున్నాయి. ఆమె నిదానంగా, హుందాగా నడుస్తూ ఇంట్లోకి వచ్చింది.

కమల తన ఒదినగారిని గుర్తుపట్టలేక పోయింది! ఎంత అందంగా వుంది ఉమ!! కమల తొట్రుపాటుతో ఉమకు స్వాగతం చెప్పి లోపలకు తీసుకు వెళ్ళింది. గోపాల్ ఆమెకు పరుపులున్న ఆసనాన్ని చూపి కూర్చోమన్నాడు. కమల పరుగు పరుగున వెళ్ళి వెండి గ్లాసులో కాఫీని, ఒక వెండి పళ్ళెం నిండా మిఠాయిలనూ వుంచి తెచ్చింది. ఇవన్నీ చూచి చిరునవ్వుతో "గోపాల్! ఇంకో పరుపులున్న ఆసనం తీసుకురా!" అంది.

ఆసనాన్ని తెచ్చారు. ఉమ తాను కప్పుకుని వున్న ఖరీదయిన పట్టుసెల్లా తీసి దానిమీద పెట్టింది. "అక్కయ్యకు ఉక్క పోస్తున్నట్లుంది! విసనకర్ర



తీసుకురా, ఫో'' అన్నాడు గోపాల్. కమల వెళ్ళి విసనకర్రతో వచ్చింది. ఉమ ప్రక్కగా నిల్చుని ఆమెకు విసరసాగింది.

ఉమ ఒక్కొక్కటిగా తన నగలన్నిటినీ తీసి రెండవ ఆసనం మీద ఉంచ సాగింది. "ఏమిటక్కయ్యా! నగలు బరువుగా వున్నాయా?'' అని అడిగాడు గోపాల్.

ఉమ ఏమీ మాట్లాడలేదు. నగలన్నిటినీ తీసి పెట్టాక మిఠాయిలన్నిటినీ తీసుకుని ఒక్కొక్క నగమీద ఒక్కొక్క మిఠాయి చొప్పున వుంచసాగింది. చూస్తున్న వారందరూ ఆశ్చర్య పోతున్నారు. ఇదేమి వింత? గోపాల్ ఇక వుండ బట్టలేక అడిగాడు. "అక్కయ్యా! ఏమిటి నువ్వు చేస్తున్నది?''

ఉమ ఎప్పటివలెనే చిరునవ్వుతో చెప్పింది. "ఆ మిఠాయిలను ఎవరికోసం ఇచ్చారో వారికి అందజేస్తున్నాను. లేకపోతే ఈ మిఠాయిలు, ఈ వెండి పళ్ళెం ఇవన్నీ నాకోసమా? నా చీరకు, నా నగలకు పెట్టారు మీరు? కనుక అవి నాకోసం కాదు. నేను ఎప్పటిలాగా అరిటాకుమీద ప్రసాదం తీసుకుంటాను. ఇన్ని సంవత్స రాల నుండి నాకు, నా పిల్లలకు ప్రసాదం ఆ విధంగానే కదా లభించింది?''

ఆమె మాటలు గొడ్డలిపోటులా ఉన్నాయి. గదిలో ఎవ్వరూ మాట్లాడ లేదు. అతిధులందరూ రహస్యంగా కమలను గోపాల్‌ను విమర్శించసాగారు.

గోపాల్‌కు కమలకు చాల అవమానం కలిగింది. గోపాల్ కమలవైపు కొరకొర చూశాడు. ఆమె కుమిలిపోతూ తలవంచుకుని నిల్చుంది. వారి బాధను గుర్తించింది ఉమ. ఆమె గోపాల్‌తో "తమ్ముడూ! నీమీద నా ప్రేమ ఎప్పుడూ ఒకలాగే వుంటుంది. నేను చిరిగిన గుడ్డలతోవచ్చినా పట్టుచీరలతో వచ్చినా నిన్ను ఒకలాగనే ఆశీర్వదిస్తాను'' అంది. గోపాల్ కండ్లలో నీరు క్రమ్మింది. అక్కయ్యను కావలించుకున్నాడు. చిన్నప్పుడు ఏదయినా అల్లరిచేసినందుకు కోప్పడితే తన్ను కావలించుకున్న తమ్ముడు ఈ గోపాలు అనిపించింది ఆమెకు.

"క్షమించు అక్కయ్యా'' అని నోరుతెరిచి అడగలేదు గోపాల్. అలా అడగకుండానే గోపాల్‌నూ కమలనూ ఉమ మనసారా క్షమించింది.

# 5. మెత్తని పడక

ఒకానొకప్పుడు మీనాక్షి అన్న ఒక రాణి వుండేది. ఆమెకు నిద్ర సరిగా పట్టేదికాదు. రాత్రంతా ఆమె పడకమీద ఇటూ అటూ పొర్లుతుండేది. మధ్య మధ్య –"అయ్యో! ఈ పడకలో ఎదో గట్టిగా గుచ్చుకుంటున్నది. నాకు నిద్ర రావడంలేదు. అబ్బబ్బా" అని అరుస్తూ వుండేది.

రాజుగారు తన సేవకులను దూరదూర ప్రాంతాలకు పంపించి అక్కడినుండి మేలు రకపు, మెత్తటి బూరుగ దూదిని తెప్పించారు. రాజుగారి దర్జీవాడు మెత్తటి గుడ్డ తీసుకుని రాణీగారి కోసం అతి మెత్తటి పరుపును కుట్టాడు. అయినాసరే రాణీకి ఆ పరుపు సుఖంగా లేదు. "ఇదేమంత మెత్తగా లేదు. పడుకోవటానికి మెత్తటి పడక లేకపోతే నేను నిద్రపోలేను. ఇట్లా నిద్రలేకుండా ఏదో జబ్బుచేసి నేను చచ్చిపోతాను" అంటూ గోల పెట్టింది.

రాజుగారికేమీ పాలుపోలేదు. "ఇంత మెత్తటి దూదితో కుట్టిన పరుపు కూడా మెత్తగా లేదంటున్నావు. ఏం చేయాలో నాకు తెలియడం లేదు." అన్నాడాయన. వికలమైన మనస్సుతో రాజుగారు తోటలోకి వెళ్ళి ఇటూ అటూ పచార్లు చేయసాగారు. రాజుగారిట్లా విచారంతో వుండగా ప్రధానమంత్రి అక్కడికి వచ్చాడు. వంగి, వందనం చేసి ఆ మంత్రి "స్వామీ! నాకో ఉపాయం తోచింది. మన రాణీగారికి అతి మెత్తటి పడకను నేను ఏర్పాటు చేయగల ననుకుంటాను" అన్నాడు.

"నిజంగానా! చెప్పు చూదాం..."

ప్రధాన మంత్రి ఇట్లా చెప్పాడు. "ప్రభూ! మన తోటలో వందల కొలది,

రకరకాల పూల మొక్కలు, తీగలు వున్నాయి. మల్లె, మొల్ల, సంపంగి, జాజి వంటివి, పాలకంటె తెల్లనివి, వెన్నకన్న మెత్తనివి ఎన్నో పువ్వులున్నాయి. మన సేవకులను ప్రతిరోజు సాయంకాలం కాగానే ఈ పూల మొగ్గలను సేకరించ మందాము. వీటిలో మేలైన వాటిని ఎన్నుకుని రాణిగారి పడకమీద పరచ మందాం. అప్పుడు రాణివారి పడక మెత్తగా, హాయిగా వుండగలదు. వారు ఎటువంటి బాధ లేకుండా నిదుర పోగలరు. తెలతెలవారుతుండగా ఆ మొగ్గలు విచ్చుకుంటాయి. గదంతా వాటి ఘుమఘుమలతో నిండుతుంది. ఆ పరిమళం రాణిగారికి ఎంతో ఆహ్లాదకరంగా వుండగలదు."

రాజుగారికి ఈ ఉపాయం నచ్చింది. "ప్రయత్నించి చూద్దాము" అన్నారు.

మరుసటి రోజు తోటమాలికి ఆజ్ఞ అందింది. ఆ రోజు అతడు పూల మొక్కలను మరింత జాగ్రత్తగా చూచుకున్నాడు. సాయంకాలం అవగానే అతడు, రాజభటులు కలిసి మేలైన మొగ్గలన్నిటిని తుంచారు. రాణిగారి చెలికత్తెలు వాటిలో మంచివాటిని ఎన్నుకుని రాణిగారి పడకమీద ఒత్తుగా పరచారు.

ఆ రాత్రి రాణికి నిజంగా మంచి నిద్ర పట్టింది. అది విని రాజుగారు సంతోషించారు. ప్రధాన మంత్రికి బహుమానాలిచ్చారు. ఇట్లాగే రోజూ పూల పానుపు అమర్చేవారు. రాణి హాయిగా నిద్ర పోయేది. "అమ్మయ్యా, ఒక చిక్కు తీరి పోయింది!" అనుకున్నాడు రాజు.

కాని కొన్ని రోజుల తర్వాత ఒకరోజు తెల్లవారుఝామున రాణి పడక గది నుండి కెవ్వుమని కేక వినిపించింది. అందరూ పరుగెత్తుకుని వెళ్ళారు. రాణిగారు పడకమీద లేచికూర్చుని ఆగ్రహంతో వీపు రుద్దుకుంటున్నది. ఎక్కడో ఏదో పొరబాటు జరిగిపోయింది. రాజుగారి సేవికలందరూ గజగజ వణుకుతూ నిల్చున్నారు.

"రాత్రి పడకను సిద్ధం చేసిందెవరు?" అని రాణి గద్దించి అడిగింది.

సేవకురాండ్రందరూ ఒకరి మొహాలు ఒకరు చూచుకున్నారు. వారిలో ఒక్కతె చెప్పింది. "మేమందరము కలిసి సిద్ధం చేశామండి! ఏదన్నా పొరబాటుంటే మన్నించండి–"



"హు!" మన్నించడమా!... మీరు సరిగా పడక అమర్చలేదు. రాత్రంతా గట్టిగా ఏదో నా వీపుకు గుచ్చుకుంటూనే వుంది. నాకు నిద్ర రానే రాలేదు."

తాము ఎంతో జాగ్రత్తగా, శ్రద్ధగా పడక అమర్చామని సేవికలు ఎంత చెప్పినా రాణిగారు ఒప్పుకోలేదు. అపుడు రాజుగారు, "ఆ పడకను జాగ్రత్తగా పరిశీలిస్తే అసలు విషయం తెలుస్తుంది కదా" అన్నారు.

జాగ్రత్తగా పడకనంతా పరిశీలించారు. ప్రతి మొగ్గను తీసిచూదారు. ఇట్లా చూడగా, చూడగా, తెల్లవారుఝాము వేళకు అన్ని మొగ్గలూ విచ్చుకున్నాయని,

ఒకే ఒక మొగ్గ వికసించలేదని, ఆ మొగ్గ వలన రాణిగారికి బాధ కల్గిందని, అందువలన ఆమె నిద్ర పాడయిందని తెలిసింది.

రాజుగారికి కోపం వచ్చింది. మొగ్గల్ని సరిగా ఏరలేదని ఆ సేవికలందరిని పనిలోనుంచి తొలగించి వేశాడు. తోటమాలి ఉద్యోగమూ ఊడింది.

అయినా రాణి మనసుకు సంతృప్తి కలుగలేదు. ఆమె కంట నీరుతో — "నేనిక్కడ ఒక్క క్షణం కూడా వుండను. నేను తక్షణం మా అన్నగారింటికి వెళ్ళిపోతాను" అంది.

రాజుగారు, ప్రధానమంత్రి మొదలయిన వారందరు కూడా ఆమెను అక్కడే వుండమని ఎంత బ్రతిమాలినా ఆమె వినలేదు. రాజుగారికి విధిలేక ఆమె ప్రయాణానికి తగిన ఏర్పాట్లు చేయించారు.

రాణిగారి అన్నగారు ఎక్కడో సముద్రానికవతల దూరదేశంలో వుండేవారు. అక్కడికి చేరడం చాల కష్టం. అంచేత రాజుగారు అన్ని సదుపాయాలతో ఒక పెద్ద ఓడను నిర్మింపజేశారు. ఆ ఓడనిండా సేవకులను,





సేవికలను ఏర్పాటు చేశారు. ఓడ నడిపేవారిని జాగ్రత్తగా నడపమని హెచ్చరించారు. రాణిగారిని క్షేమంగా వాళ్ళన్నయ్య దేశానికి గనుక చేర్చితే వాళ్ళందరికీ మంచి బహుమతులిస్తానని చెప్పారు.

రాణిగారి ఓడ బయలుదేరింది. చల్లటి సముద్రపు గాలి రాణికి ఎంతో హాయి అనిపించింది. ఆమె కోపమంతా క్రమక్రమంగా చల్లారింది. ఆమె ఉల్లాసంగా వుంది. కాని ఆ మరుసటిదినం సముద్రం ఉధృతంగావుంది. తుఫానుగాలి వీచసాగింది. అలలు ఉవ్వెత్తుగా లేస్తున్నాయి. ఆ ఓడ ఇటూ అటూ అల్లలాడ సాగింది. మరి కొంత సేపటికి ఆ నావ మునిగిపోసాగింది. ప్రతివాళ్లూ సముద్రం లోకి దూకారు. దైవ వశాత్తు ఒక్క రాణిమాత్రం మునిగిపోలేదు. చెదిరిపోయిన ఒక కర్రచెక్క తేలుతూంటే, ఆమె దానిని గట్టిగా పట్టుకుంది. సముద్రపు అలలలో ఆమె ఆ చెక్కతోసహా కొట్టుకునిపోయి కొంతదూరాన ఒడ్డుకు చేరింది. ఆమె స్పృహలేకుండా ఒడ్డుమీద పడివుంది. కొంత సేపటికి ఆమెకు తెలివివచ్చింది.

కొంతదూరాన ఒక గుడిసె కనుపించింది. అతి కష్టంమీద నడుచుకుంటూ ఆమె లోపలికి వెళ్ళింది. అందులో ఒక ముసలివాడు, అతని పెళ్ళాము వున్నారు.

“తుఫానునుండి ప్రాణాలతో బయట పడ్డాను. నావాళ్ళందరూ సముద్రంలో మునిగిపోయారు. నాకు మీరు ఆశ్రయమివ్వాలి. నేను మీతోబాటు



వుంటాను. నాకు ఉండేటందుకు కాస్త చోటు ఇచ్చి, తినడానికి తిండి పెట్టి నన్ను ఆదరించాలి.'' అని ఆమె వాళ్ళతో చెప్పింది. తాను రాణిని అని మాత్రం చెప్పలేదు.

ఆ ముసలి దంపతులు చాల మంచివాళ్ళు. ''అల్లాగే వుండమ్మా! నీ ఇష్టం వచ్చినంత కాలం మాతో వుండు. మేమిద్దరమూ ముసలి వాళ్ళము. మాకు కూడా నీలాటి చిన్న వయస్సులో వున్నవారి సాయం కావాలి'' అన్నారు.

ఆ గుడిసెలో వున్న వాళ్ళు ఏ పని కూడా చేయలేనంత ముసలివాళ్ళు. కనుక రాణి వారికి సాయపడసాగింది. తిండి కోసం పని చేయడానికి సిద్ధమయింది. ఆ దగ్గర్లోనే ఒక గ్రామంలో, నదికి అడ్డంగా ఆనకట్ట కడుతున్నారు. అక్కడ వందలాది స్త్రీలూ, పురుషులూ కూలిపని చేస్తున్నారు. అక్కడికి వెళ్ళితే పని దొరుకుతుంది అని రాణికి అనిపించింది. కాని తాను—పువ్వుల పాన్పు గట్టిగా అనిపించి నిద్రరాని తాను—కూలిపని చేయడమా ? రాణికి ఏడుపు వచ్చింది. కాని ఏం చేయడం? పనిలోనికి వెళ్ళక తప్పలేదు.

ఆనకట్ట దగ్గర కూలిపనిలో చేరింది రాణి. మిగతా ఎందరో ఆడ, మగతో కలిసి ఆమె కష్టపడి పని చేయసాగింది. అందరిలాగే ఆమెకు రోజు కూలిగా కొద్దిపాటి డబ్బు చేతికి వచ్చేది. ఆ డబ్బును ఆమె తనకు, ఆ ముసలి దంపతులకు తిండి, బట్ట కొనడానికి ఖర్చు పెడుతుండేది. ఆమె కిప్పుడు జొన్నరొట్టె ఆహారం. కటిక నేలమీద పరచిన పాత చాపే ఆమె పడక. పనిచేసి చేసి అలసి వుండడం వలన చాపమీద మేను వాల్చగానే ఆమెకు మంచి నిద్ర పట్టేది.

ఒకరోజు ఒక తమాషా జరిగింది. ఆ దేశపు రాజు ఆనకట్ట నిర్మాణాన్ని చూడడానికి అక్కడికి వచ్చాడు. ఆ రోజు కూలిని రాజు స్వయంగా దగ్గరుండి ఇప్పించాడు. తన కూలి తీసుకోవడానికి రాణి ముందుకు వెళ్ళింది. ఆమెను చూచి రాజు విస్తుపోయాడు. ఆమె బట్టలు చినిగివున్నా, రాజు ఆమెను వెంటనే గుర్తించాడు.

''చెల్లెమ్మా! ఇదేమి ఘోరం! నువ్విక్కడ కూలిపని చేయడ మేమిటి?'' అన్నాడు.

రాణి తలెత్తి చూచింది!

అవును! తన అన్నయ్యే!

సముద్రపు అలలు రాణిని ఆమె తండ్రిగారి దేశపు తీరాన పారవేశాయి. ఆమె తలదాచుకున్న గ్రామం రాజధానికి బాగా దూరంగా ఉండడం వలన ఆమె ఎవ్వరూ గుర్తించలేదు. ఆమె తండ్రి చనిపోయాక ఆమె అన్నగారే ఆ రాజ్యానికి రాజు అయి పరిపాలిస్తున్నాడు.

రాజు తన చెల్లెలిని కౌగలించుకుని కన్నీరు కార్చారు. చెల్లెలికేదో పెద్ద పత్తు కల్గిందని గ్రహించాడు. "నువ్వు ఇట్లా కనబడడం చూస్తే నా గుండె చుక్కు పోతూంది. ఎందుకిట్లా అయింది? నువ్వు తిన్నగా నా దగ్గరికి ఎందుకు రాలేదు?" అని రాజు చెల్లెలిని అడిగాడు.

రాణి చిరునవ్వు నవ్వి సమాధానం చెప్పింది: "అన్నయ్యా! జరిగినదంతా నా మేలుకే జరిగింది. ఇందుకోసం కష్టపడ నక్కర్లేదు. అసలు ఇంత చక్కగా నాకు బుద్ధి చెప్పినందుకు దేవుడికి కృతజ్ఞత తెలుపుకోవాలి. రాణిగా వున్నప్పుడు నేను అనేక భోగభాగ్యాలతో వుండేదానిని. అయినా నా కప్పుడు సంతృప్తి వుండేది కాదు. ఎంత మెత్తటి పడక వేసినా నిద్ర పోయేదానిని కాదు. నా సుఖం కోసం నా నిద్రకోసం నా భర్త ఎన్నో ప్రయత్నాలు చేశారు. కాని నేను సంతోషంగా వుండలేదు. ఇపుడు నాకు సామాన్యమైన వారు ఎంతో శ్రమించి జీవిస్తారో తెలిసి వచ్చింది. విధి నన్ను వారిలో ఒక్కతెగా చేసింది. ఇప్పుడు నేను కష్టపడి పనిచేస్తున్నాను, చాపమీద పడుకుని హాయిగా నిద్రపోతున్నాను. పడక మెత్తగా లేదన్న గొడవే లేకుండా నిద్రపోతున్నాను."

ఆ రాజు చాల నిరాడంబరమైనవాడు. ఆయన చెల్లెలు చెప్పినది విని సంతోషించాడు. ఆయన వెంటనే చెల్లెలి భర్తగారికి ఆమె సుఖంగా వుందని, ఆయనను బయలుదేరి తమ నగరానికి రమ్మని కబురు పంపాడు.

ఆ కబురు తెలియగానే రాజుగారికి ఎనలేని సంతోషం కలిగింది. తన రాణి బతికివుందని, క్షేమంగా తన అన్న ఇంట్లో ఉన్నదని తెలిసి ఆయన దేవుడికి

కృతజ్ఞత చెప్పుకున్నాడు. వెంటనే ఆయన ధన ధాన్య వాహనాలతో ఓడమీద బయలుదేరి బావగారి రాజ్యం చేరాడు.

అక్కడ రాజుగారు తన భార్యను చూచారు. ఆమె మునపటికన్న అందంగా కనుపించింది. ఆమె మొహంలో మునుపటివలె చిటపటలు లేక ప్రశాంతి, సంతృప్తి గోచరించాయి. "నీకు చక్కగా నిద్రపడుతున్నట్లుంది...మీ అన్నయ్య నీకు అతి మెత్తటి పడక ఏర్పాటు చేసినట్లున్నారు. అవునా? బహుశ గులాబీరేకుల పడక వేయిస్తున్నాడా?" అని రాజుగారు అడిగారు.

"లేదు ప్రభూ! చాపమీద పడుకుంటున్నాను" అంది రాణి చిరునవ్వుతో.



# 6. చచ్చిన ఎలుక తెచ్చిన లాభం

చాలాకాలం క్రింద వారణాసి నగరంలో చందనుడనే గొప్ప పండితుడుండేవాడు. ఒక రోజు ఆయన ఏదో మననం చేసుకుంటూ నడిచి వెళ్తుంటే, దారికడ్డంగా ఒక చచ్చిన ఎలుక పడివుంది.

దానిని చూడగానే అయన "ఛీ ఛీ..." అనుకున్నాడు. ఆ వెంటనే— "నేను అట్లా ఎందుకనుకోవాలి! చచ్చిన ఎలుక కూడా సంతోషం కలిగించ వచ్చును. వివేకవంతుడెవడయినా పూనుకుంటే ఈ చచ్చిన ఎలుకతో సంపద సంపాదించ వచ్చును-" అన్నాడు.

అయన వెనకాలే నడిచివస్తున్న హరి అన్న ఒక బీదయువకుడు ఈ పండితుడి మాటలను విన్నాడు. "ఈయన పెద్దవాడు. బాగా చదువుకున్న వాడు. ఈయన చెప్పిన దానిలో ఎంతో నిజం వుండి వుండాలి." అనుకుంటూ ఆ చచ్చిన ఎలుకను చేతిలోకి తీసుకున్నాడు. దానిని ఏమి చేయడమా అని అలోచిస్తుండగా ఒక ఉపాయం తోచింది.

"పిల్లికి తినడానికి ఎలుకకన్న ప్రీతికరమైన వస్తువేమి వుంటుంది? ప్రక్కింటాయన పిల్లిని పెంచుతున్నాడు. వాళ్ళింట్లో ఎలుకలు లేవు. అంచేత ఈ ఎలుకను తీసుకెళ్లి ఇస్తే ఆ పిల్లికి విందు భోజనం పెట్టినట్లుంటుంది." అనుకుని ఆ ఎలుకను తీసుకువెళ్లి వాళ్ళ ప్రక్కింటాయనకు చూపించాడు.

"అరె ఎలుకా? ఎక్కడినుంచి తీసుకొచ్చావోయ్! దానిని మా పిల్లికి పడేయి. ఇంద, ఈ డబ్బు తీసుకో" అని ఒక నాణెం ఇచ్చాడు. హరి ఆ



డబ్బుతో బజారుకు వెళ్లి కొంత మిఠాయి కొన్నాడు. .ఆ మిఠాయినీ ఒక కుండలో మంచి నీటినీ తీసుకుని వెళ్ళి ఊరి వెలుపల వున్న పెద్ద తోట గుమ్మం దగ్గర మర్రి చెట్టు క్రింద కూర్చున్నాడు.

కాస్సేపు తర్వాత ఒక తోటమాలి బయటికి వచ్చాడు. అతడు పని చేసి చేసి అలిసిపోయి, ఆకలితో వున్నాడు. హరి అతడికి మిఠాయిపెట్టి మంచినీళ్ళిచ్చాడు. ఆ తోటమాలికి చాల తృప్తి కలిగింది. అతడు హరికి ఒక పెద్ద పూలగుత్తి నిచ్చాడు.

హరి ఆ పువ్వులను ఊళ్ళోకి తీసుకువెళ్ళి అమ్మాడు. మళ్ళీ, ఎక్కువగా మిఠాయిలను కొన్నాడు. ఈసారి తోటలో పనిచేసి అలిసి, ఆకలితో బయటికి వచ్చిన వారందరికీ మిఠాయిలూ మంచినీళ్ళు ఇచ్చాడు. వాళ్ళందరూ కలసి అతడికి చాల పూల గుత్తులు ఇచ్చారు. ఆ పువ్వుల నమ్మాడు. ఈసారి హరి బోలెడు మిఠాయిలను కొన్నాడు. తోటమాలులకే గాక తోటలో షికారుకొచ్చే వారికి కూడా మిఠాయిలు అమ్మాడు. ఇట్లు హరి చాల డబ్బు మిగిల్చాడు.

ఒక రోజు పెద్ద తుఫాను వచ్చింది. ఆ గాలి వేగానికి ఆకులు, పువ్వులు, చిన్న చిన్న చెట్లు రాలి, కూలి పడిపోయాయి. తోటలోపల నయితే నేలంతా చెత్త చెదారంతో నిండిపోయింది. దానినంతా చిమ్మి బాగు చేయడం తమ వలన కాదని భయపడ్డారు తోట పనివారు. పైపెచ్చు ఆ రోజే రాజుగారు తోట తనిఖీ చేయడానికి వస్తానన్నారు. తోట పని వారికి ఏం చేయాలో తోచలేదు.

అట్లాంటి సమయంలో ఆ హరి వారితో — "నాకు గనుక బాగా కూలి ఇస్తే నేను తోటనంతా శుభ్రం చేస్తా" నన్నాడు. వాళ్లు అందుకు సంతోషంతో ఒప్పుకున్నారు.

హరి అంటే ఎందరో బాల బాలకులకు చాల ఇష్టం. హరి వాళ్ళందరినీ పిలిచాడు. "మీరందరూ కలిసి అరగంటలో ఈ తోట నంతా శుభ్రం చేయాలి. రాజుగారు వచ్చి చూచి మెచ్చుకునేలా చేయాలి" అని చెప్పాడు.

పిల్లలకు ఆ పని చేయడం అంటే బలే సరదావేసింది. చక చక అరగంటలో తోటనంతా శుభ్రంచేశారు. చెత్త చెదారం అంతా బయట పోగుచేశారు. అప్పుడు హరి వాళ్ళతో—ఈ పోగును ఇంకాస్త అవతలికి చిమ్ముదాం" అన్నాడు. వాళ్ళట్లాగే చేశారు.

కాస్తంత దూరంలో ఒక కుమ్మరివాడి గుడిసె వుంది. అతడి గుడిసెముందు ఇదంతా ప్రోగుచేశారు. హరి ఆ కుమ్మరితో—"ఇదిగోనయ్యా! నీకు ఒక నెలకు సరిపడా ఆవంలోకి పుల్లలూ అవీ-" అని చెప్పాడు. కుమ్మరి సంతోషంతో హరికి డబ్బులిచ్చాడు.

తోట శుభ్రంచేసినందుకు తోటవారూ హరికి డబ్బులిచ్చారు. ఈ డబ్బు మొత్తంలో సగం తానుంచుకొని మిగతా సగంతో మిఠాయిలు కొని పిల్లలందరికీ పంచిపెట్టాడు. పిల్లలందరూ "హరి మామయ్య మంచివాడు" అని సంతోషంతో గంతులేస్తూ వెళ్ళిపోయారు.

హరి ఇప్పుడు బాట ప్రక్కగా ఒక చలివేంద్రం ప్రారంభించాడు. మంచి కుండలను కొన్నాడు. వాటి నిండా మంచినీరు పోసివుంచాడు.

ఒకనాడు ఆ దారివెంబడి అయిదు వందలమంది నెత్తిమీద గడ్డిమోపులతో వచ్చారు. వారు ఎండ వేడిమికి బాగా అలసిపోయారు. వారికి బాగా దాహం వేస్తూంది. వారందరికీ త్రాగడానికి చల్లని నీరిచ్చాడు హరి. అది త్రాగి వారు—"ఈ మంచినీరు అమృతంలా వుంది. నిజంగా దేవతలా వచ్చి మా దాహం తీర్చావు. నీ సాయానికి ప్రతిఫలంగా మేము నీకు ఏమి ఇవ్వగలము. మా దగ్గర డబ్బు లేదు. మా దగ్గర ఇంత గడ్డి వుంది. కాని కొనేవారే కనిపించడం లేదు," అన్నారు.

"నాకు డబ్బు వద్దు. మీలో ఒక్కొక్కరూ ఇంతింత గడ్డి పడేసి పొండి అదేచాలు. మీకో మంచి వార్త కూడా చెబుతున్నాను వినండి. త్వరలో ఒక గుర్రాల వ్యాపారి ఇటు వస్తున్నాడు. అతడు మీ గడ్డి మోపులన్నిటినీ కొంటాడు. అయితే ఒక్క సాయం చేయండి. నేను ఈ గడ్డినంతటినీ అమ్మిన తర్వాతనే మీ దగ్గరున్న గడ్డి అమ్మండి-" అని హరి అన్నాడు. ఆ గడ్డి మోపుల వాళ్ళందరూ వెళ్ళిపోయారు. కొంతసేపు తర్వాత ఒక గుర్రాల వ్యాపారి అయిదు వందల గుర్రాలతో వచ్చాడు. అంతకుముందు అతడు ప్రయాణం చేసిన జిల్లాలో ఎక్కడా అతడి గుర్రాలకు కావలసిన గడ్డి దొరకలేదు. అందుచేత అతడు హరి

దగ్గర నుండి అయిదువందల కట్టల గడ్డిని తీసుకుని అయిదు వందల వెండి నాణాలు నిచ్చాడు.

హరి చలివేంద్రను నడుపుతూనే వున్నాడు. కొన్ని రోజుల తర్వాత ఒక కబురు వచ్చింది. ఒక వ్యాపారి అనేక పడవలనిండా సరకులతో నది దాటి వస్తున్నాడని తెలిసింది. "నేను అక్కడికి చేరాలి" అనుకొన్నాడు హరి. డబ్బంతా ఖర్చుపెట్టి ఒక రథం కొన్నాడు. దానిని పువ్వులతో అలంకరించాడు. దానిమీద కూర్చుని కులాసాగా పాడుకుంటూ నది ఒడ్డు చేరాడు.

మొట్టమొదట పడవ వచ్చి ఆగింది. వెంటనే హరి ఆ పడవల నడిపే వారి నాయకుడి దగ్గరకు వెళ్ళాడు. "ఇదిగో నేస్తం! మీ వ్యాపారితో చెప్పి ఈ పడవలులోని సరకంతా నాకు అమ్మేటట్లు చెప్పు. నీకు పడవ ఖర్చులు కాకుండా, ఇదిగో ఈ బంగారు వుంగరం ఇస్తున్నాను." అని అతడికి బంగారు వుంగరం ఇచ్చాడు. అందుకా నాయకుడు అంగీకరించాడు.

వ్యాపారి తన సరకులన్నిటిని పడవలనుండి దింపాడు. అక్కడికక్కడే సరకంతా కొనడానికి ఒక వ్యాపారస్తుడు సిద్ధంగా వున్నాడని తెలిసి సంతోషించాడు. వీటన్నిటినీ మోసుకొని దూర దూరంగా వెళ్ళడం, అక్కడ బేరాలాడడం వంటిబెడదంతా వదలింది కదా అనుకున్నాడు. హరితో బేరం కుదుర్చుకున్నాడు.

మిగతా వ్యాపారులందరూ వచ్చేసరికి సరుకంతా హరికి స్వాధీనమయింది. "అయ్యో! మనకన్న ముందు ఈ హరి కొనేశాడే—" అనుకున్నారు వాళ్ళు. అప్పుడు వాళ్ళందరూ తమ దగ్గరున్న డబ్బంతా కలిపి హరికి రెండింతల ధర ఇచ్చి సరుకు అంతటినీ అతడి దగ్గరనుండి కొన్నారు. ఈ డబ్బులోనుండి సగాన్ని హరి ఆ బయటి వ్యాపారికిచ్చివేశాడు. నావికుల నాయకుడికే వెయ్యి వెండినాణాలనిచ్చాడు. ఇంకా అతడి దగ్గర బోలెడంత డబ్బు మిగిలింది. హరి వెనక్కు బయలుదేరాడు.

తిన్నగా చందనుడి దగ్గరకు వెళ్ళాడు. ఆయనకు నమస్కరించి ఆయన

ఎదుట రెండువేల వెండినాణాలున్న సంచిని వుంచాడు.

"ఏమిటిది?" అని అడిగాడు చందనుడు.

"ఇది నాలుగు నెలల క్రింద మీరు ఇచ్చిన సలహాకు దక్షిణ" అంటూ తన కథంతా చెప్పాడు.

అది విని చందనుడు చాల సంతోషంతో ఇట్లా అన్నాడు. "నువ్వు చాల



తెలివిగలవాడివి. నా అంతట నేనే అనుకున్న మాటలు ఒకరు విని ఆచరణలో పెడతారని నేను కలలో కూడా అనుకోలేదు. కాని నువ్వు వాటిని విన్నావు ; ఆచరణలో పెట్టావు ; లాభం పొందావు. నీవంటి వారు తప్పకుండా జీవితంలో విజయాలు సాధిస్తారు.''



# 7. న్యాయ పీఠం

మనదేశ చరిత్రలో ఉజ్జయిని చాలా పేరుమోసిన వూరు. అతి పురాతనమైనది కూడా. ఆ ఊరి పొలిమేరలలో విశాలమైన బయలు, చిన్న చిన్న కొండలు వున్నాయి. సామాన్యంగా పిల్లలు ఆ మైదానంలో చేరి ఆడుకుంటూ వుండేవారు. ఒకరోజు అలా పిల్లలు ఆటల్లో మునిగివుండగా, ఒక అబ్బాయి ఒక గుట్టవైపుగా నడిచాడు. దానిపైకి ఎక్కబోయి, కాలుజారి కిందపడ్డాడు. అక్కడ అతనికి ఒక రాతిపలక కనిపించింది. అది నున్నగా మెరుస్తూంది. అతడు తతిమ్మా స్నేహితులను పిలిచి, ఆ రాయి చూపించాడు. పిల్లలంతా సంతోషంతో చప్పట్లు చరిచారు. ఆ అబ్బాయి దర్జాగా ఆ రాతిపలకమీద కూర్చున్నాడు. "నేను రాజు గారిని. మీరంతా నా ప్రజలు. ఏదీ! మీ మీ కష్టాలూ, కలహాలూ నా ముందుకు వచ్చి చెప్పండి. తీర్పు చెబుతాను" అంటూ ఆ అబ్బాయి రాతిపలక మీద కూర్చున్నాడు.

పిల్లలందరికీ ఇది నచ్చింది. ఒక్కొక్కరే అతనిముందు నిలుచొని, ఉత్తుత్తిగా అవీ ఇవీ కష్టాలు చెప్పటం మొదలుపెట్టారు. ఆ అబ్బాయి నిజం రాజుగారిలా నటిస్తూ తీర్పులు చెప్పసాగాడు. ఇహ ఆ నాటకం అలా చాలాసేపు సాగిపోయింది.

పిల్లలకు ఈ ఆట ఎంతో నచ్చింది. రోజూ అతి ఉత్సాహంతో వాళ్లు ఆ రాయి దగ్గిర చేరేవాళ్లు. ఆరోపణలు జరిగేవి, నిందితులు చేతులు కట్టుకుని ముందుకి వచ్చేవారు, సాక్షులు ఎన్నో చెప్పేవారు. రాతిపలక మీద కూర్చున్న అబ్బాయి ఆలోచించి ఆలోచించి తీర్పులు చెప్పేవాడు.

ఆ అబ్బాయి తీర్పుల్లోని చాకచాక్యం, తెలివి అంచెలమీద ఊరంతా పాకి

పోయింది. "ఈ అబ్బాయికి నిజంగా దైవిక శక్తులు వుండి వుంటాయి" అని వూళ్లో అందరూ గుసగుసలాడు కున్నారు.

ఇంతలో ఊళ్లో ఇద్దరు రైతులు ఫలానా పొలం నాదంటే నాదని పేచీ పడ్డారు. వాళ్లిద్దరూ ఉజ్జయినీ మహారాజుగారి దగ్గరకు వెళ్లకుండా ఊరి బయట వున్న ఆ బాలరాజు దగ్గరికి వెళ్లారు. తమ తగాదా అంతా వివరంగా చెప్పు కున్నారు. ఆ బాలరాజు ఆ గొడవనంతా ఓపిగ్గా విని తీర్పు చెప్పాడు. అతని తెలివితేటలు నిజాయితీ చూసి, వాళ్లకి అమిత ఆశ్చర్యం కలిగింది.

ఇహ ఆరోజు మొదలు ఊళ్లో ప్రజలంతా అసలు రాజుగారి వద్దకు వెళ్లడం మానేశారు; పిల్లల బాలరాజు దగ్గిరకే వెళ్లటం ప్రారంభించారు. అతడు యిచ్చే తీర్పులు వారికి ఎంతో తృప్తికరంగా, న్యాయసమ్మతంగా తోచాయి.

ఈ వార్త చివరికి రాజుగారి చెవిన కూడా పడింది. "ఒక కుర్రకుంక ఏమిటి! నా కంటే బాగా తీర్పులు చెప్పగలగడమేమిటి?" అంటూ రాజుగారు మీసం దువ్వి, గర్జించారు. "ఇందులో ఏదో మోసం వుంది, ఇది నేను నమ్మను. నేనే స్వయంగా వెళ్లి చూస్తాను" అంటూ సేనాధిపతులు, భటులు వెంటరాగా, కొండదగ్గరకు నడిచారు. కానీ తీరా పిల్లలు ఆడుతున్న ఆ నాటకం, తీర్పులు చూశాక, రాజుగారికీ ఆశ్చర్యం వేసింది. ఆయన హృదయం ఆనందంతో మురిసి పోయింది.

"ఈ అబ్బాయి తెలివి అమోఘం! ఇంత పసివాడు ఇంత అద్భుతంగా తీర్పులు చెబుతాడని నేను అనుకోనేలేదు. ఎందరో విద్వాంసులు, పండితులు ఇతడి ముందు తలలు వంచి తీరాలనడంలో సందేహం లేదు." అన్నారు రాజుగారు మంత్రులతో. అప్పుడు మంత్రులు "కానీ మహాప్రభూ! నిత్యం తీర్పులు యిచ్చే అబ్బాయి ఇతడు కాదు. అస్వస్థత వల్ల అతడు రాలేకపోతే మరో అబ్బాయి ఇవేళ రాజు పాత్ర వహించాడు" అన్నారు మంత్రులు. "ఇదేదో విచిత్రంగా వుందే! అయితే నన్ను ఆ రాతి పలకను చూడనీయండి. బహుశా దాని కేమ యినా అపూర్వశక్తు లున్నాయేమో?" అన్నాడు రాజుగారు.

వెంటనే రాజభటులు ఆ పలక చుట్టూరా మట్టిని తవ్వారు. ఆశ్చర్యం!

అడుగున ఒక చక్కని రాజసింహాసనం కనుపించింది. ఆ సింహాసనపు నాలుగు కాళ్ళకూ నాలుగు అందమైన దేవతా విగ్రహాలు చెక్కివున్నాయి. "ఈ సింహాసనం కొన్ని వందల సంవత్సరాల క్రింద విక్రమరాజు ఉపయోగించినది. ఎంతో కీర్తి, ప్రఖ్యాతి గడించిన విక్రమరాజు ఆ సింహాసనం మీద కూర్చునే తీర్పులు ఇచ్చాడు." అని రాజుగారి కొలువులో వున్న పండితుడు చెప్పాడు. ఇది విని రాజుగారు బలే సంతోషించారు. వెంటనే ఆ సింహాసనాన్ని రాజభవనం చేర్చి, అక్కడ ప్రతిష్ఠించమని ఉత్తరువు చేశారు ఆ రోజునుంచీ, తను ఆ సింహాసనం మీద కూర్చోవాలి, ప్రజలలో న్యాయం ధర్మం పెంచే తీర్పులు చెప్పాలి అని రాజుగారు నిశ్చయించుకున్నారు.

ఆ మరునాడు, రాజభవనం జనంతో కిటకిటలాడుతూంది. రాజుగారు లోపలికి ప్రవేశిస్తూనే, తిన్నగా సింహాసనం వైపు నడిచారు. కాని ఆయన దాని మీద కూర్చోబోతుండగా, "ఆగు! మహారాజా!" అని ఓ కంఠం బిగ్గరగా అరిచింది.

రాజుగారు ఓ క్షణం నిశ్చేష్టులయి, చుట్టూ కలియజూశారు. కానీ ఆయనకు ఎవరూ కనుపించలేదు. మళ్లీ ఓమాటు జాగ్రత్తగా చూశారు. ఆ కంఠం సింహాసనం కాలిమీద వున్న దేవతా విగ్రహంది. "రాజా! ఈ సింహాసనం అలంకరించటానికి నువ్వు నిజంగా యోగ్యుడివా? ఎన్నడూ దొంగతనం చెయ్యలేదని గుండె మీద చెయ్యివేసుకు చెప్పగలవా?" అని అడిగింది దేవత.

రాజుగారు అవమానంతో తల వంచుకున్నారు. "ఇటీవల నా కొలువులో ఒక వ్యక్తిమీద నిరాదరణ కలిగి, అతని భూమిని అపహరించాను" అన్నారు గొంతు వణకుతూండగా. "అయితే లాభం లేదు! నువ్వు మూడు రోజుల పాటు తపస్సు చేసి రావాలి" అంటూ ఆ దేవత రెక్కలు విచ్చుకొని ఎగిరిపోయింది.

అన్నం నీళ్ళూ ముట్టకుండా, రాజుగారు మూడు రోజులు తపస్సు చేశారు. నాలుగో రోజు యథాప్రకారం సింహాసనాన్ని సమీపించారు. కానీ తీరా కూర్చోబోతుండగా, రెండో దేవత గొంతెత్తి, "మహారాజా! ఆగు! నువ్వెన్నడూ అబద్ధం ఆడి ఎరగవా?" అని అడిగింది. రాజుగారు బిత్తరపోయారు. నిజానికి, కొన్ని

క్లిష్టపరిస్థితులనుంచి బైటపడేందుకు ఆయన ఇదివర కెన్నో మాట్లు అబద్ధాలాడాడు. అందుకని, ఆ విషయం కాస్తా బైటపెట్టి, సింహాసనానికి దూరంగా నిలుచుండి పోవలసి వచ్చింది. చూస్తుండగానే, రెండో దేవత కూడా తుర్రున ఎగిరి పోయింది.

మళ్ళీ ఉపవాసాలూ, ప్రార్థనలూ జరిగాయి. ఈ మాటు రాజుగారు ఎంతో తటపటాయిస్తూ సింహాసనాన్ని సమీపించారు. ఈసారి మూడో దేవత నిలదీసింది. "మహారాజా! నువ్వింతవరకూ ఏ ప్రాణికీ హానిచేయలేదా? ఎవరినీ బాధించలేదా? చెప్పు" అని అడిగింది. రాజుగారు మౌనం వహించటంతో ఆ దేవత కూడా ఎగిరిపోయింది.

రాజుగారు మళ్ళీ ఉపవాసం, తపస్సు ముగించారు. నాల్గవసారిగా సింహాసనం సమీపిస్తుంటే ఎందుకో ఆయన కాళ్లు వణికాయి. అడుగులు తడబడ్డాయి.

నాలుగో దేవత కూడా ఆయన్ని వదిలిపెట్టలేదు. "మహారాజా! ఈ సింహాసనంమీద కూర్చున్న అబ్బాయిలు కల్లాకపటం ఎరగని అమాయకులు. ఈ రాజ్యంలో అందరికన్నా ఉత్తమ న్యాయమూర్తివి నువ్వేనని నమ్మితే, రా, ఈ సింహాసనంమీద కూర్చో" అని ఆహ్వానించింది దేవత.

రాజుగారు కాస్సేపు ఆలోచనలో పడ్డారు. "ఒక పసిబాలుడు దీనిమీద కూర్చోగా లేనిది నేనెందుకు కూర్చోకూడదు? నేను మహారాజుని. నాకన్న తెలివిగలవాడు, ఘనుడు, ఐశ్వర్యవంతుడు నిష్పక్షపాతంగా న్యాయం చెప్పగలవాడు ఇంకెవరున్నారు? సందేహం దేనికి? ఇప్పుడే దీనిమీద కూర్చుంటాను." అని తనలో తను అనుకుంటూ, ఆత్రంగా సింహాసనం మీద కూర్చోబోయారు. ఇంతలో, ఠక్కున నాలుగోదేవత రెక్కలు విచ్చింది. సింహాసనంతోసహా తుర్రున ఆకాశంలోకి ఎగిరిపోయింది.

# 7. యుక్తి తెలిసిన భార్య

ఎన్నో సంవత్సరాల క్రింద ఢిల్లీలో ఛోటూలాల్ అన్న వైద్యుడుండేవాడు. అతడి భార్య నందిని అందమైనది, చాల తెలివిగలది.

ఛోటూలాల్‌కు మతిమరుపు ఎక్కువ. ఎవరు ఎవరో గుర్తుండేదికాదు. జబ్బొక టయితే మందు ఇంకోటిచ్చేవాడు. పాము కరిచిందని వచ్చిన వాడికి దగ్గుమందు, కాలు బెణికిన స్త్రీకి తలనొప్పి మాత్రలు ఇస్తుండేవాడు. ఏట్లాగయితేనేమి- ఈ విధంగానే కొన్నేళ్ళు గడిచాయి.

ఒకరోజు వడదెబ్బ తగిలిన యువకుడొకడు ఈ వైద్యుడి దగ్గరకు వచ్చాడు. చేయి ముక్కలుగా విరిగిన ఒక ముసలామె కూడా అదే సమయానికి వైద్యుడి దగ్గరకు వచ్చింది. మన మతిమరపు వైద్యుడుగారు ఆ ముసలావిడకేమో వడ దెబ్బకు మాత్రలిచ్చేసి, ఆ యువకుడి చేతిని శస్త్రచికిత్స చేసి తీసివేశారు.

ఆ తర్వాత మరి ఛోటూలాల్ దగ్గరికి మందు కోసం జనులు రావడం మానివేశారు. రాను రాను అతడి పరిస్థితి అధ్వాన్నంగా అయింది. తన భార్యకు నగలు, చీరలు, ఏమీ కొనలేకపోయాడు. నందినికి చిరాకు, నిరాశ కలిగేది. ఆమె నిష్టూర మాడేది.

ఒకరోజు ఛోటూలాల్ ఒక్కపైసా అయినా కూడా చేతికిరాకుండా ఇల్లు చేరాడు. ఆ రోజు పొద్దుననుండి సాయంత్రందాక కూర్చున్నాడేగాని ఒక్కరూ మందుకు రాలేదు.

నందినికి బాగా కోపం వచ్చింది. "నా ఖర్మకొద్దీ ఇట్లాటి మొగుడు దొరికాడు! పెళ్ళాన్ని పోషించలేని మొగుడు మొగుడా? ఇప్పుడేమి చేయడం? నిన్నరాత్రితో

రొట్టెపిండి, పప్పు నిండుకున్నాయి. ఇప్పుడు ఆరగించడానికి ఏమీలేదు. ఇంక అడుక్కొని తినవలసిందే ... పొండి బిచ్చమెత్తుకురండి--" అంటూ ఏడవసాగింది.

ఛోటూలాల్ తలవంచుకున్నాడు. అతడికి బాధనిపించింది. తడబడుతూ చెప్పాడు. "నందినీ! ఏడవకు నందినీ! ఒక్కసారి నవ్వు. నువ్వు బిచ్చమెత్త మంటే ఆ పని చేస్తాను. కాని ఎక్కడికి వెళ్ళాలో చెప్పు. నాకేమీ తెలియదు–" అన్నాడు.

నందిని కళ్ళు తుడుచుకుని, లేతగా నవ్వింది. "రాజుగారి దగ్గరికి వెళ్ళి సాయం అడగండి. ఆయన అనుగ్రహం వుంటే ఏది కావాలన్నా ఇస్తాడు" అంది.

ఛోటూలాల్ రాజుగారి అంతఃపురం చేరాడు. గుమ్మంలో మెరిసే దుస్తులూ, కత్తులూ, మీసాలూ గల భటులు నిల్చుని వున్నారు. ఛోటూలాల్ ధైర్యంగా వాళ్ళందరినీ దాటి దర్బారు హాలులోకి వెళ్ళాడు.

అక్కడ రత్నాలు చెక్కిన బంగారు సింహాసనం మీద రాజుగారు ఠీవిగా కూర్చుని వున్నారు. ఆయన కటూ ఇటూ మంత్రులు సభాసదులూ అంతా కూర్చుని వున్నారు.

ఛోటూలాల్ వంగి మూడుసార్లు నమస్కరించాడు. తర్వాత ధైర్యం తెచ్చుకొని "మహారాజా! నాకు ఏదో ఒకటి ఇప్పించండి" అని అడిగాడు.

రాజు నవ్వాడు. "నీకు ఏమి కావాలో కోరుకో" అన్నాడు.

ఛోటూలాల్ నోట మాట రాలేదు. రాజుగారిని ఏమి అడగాలో నందిని చెప్పలేదు. ఏదడిగినా రాజుగారిస్తాడంది. అంచేత ఛోటూలాల్ మళ్ళీ "ఏదన్నాసరే. మహారాజా!" అన్నాడు.

రాజుగారు మంత్రితో - "ఎవ్వరికీ అక్కర్లేని భూమిని ఇతడికి ఇప్పించండి" అని చెప్పారు.

ఛోటూలాల్ పాట పాడుకుంటూ ఇంటికి వెళ్ళి నందినితో అన్నీ చెప్పాడు.

"రాజుగారెంత మంచి వారనుకున్నావు! ఇంకెవ్వరికీ అక్కర్లేని భూమిని నా కిచ్చారు!" అన్నాడు.

నందినికి ఏడుపు వచ్చింది. కాస్సేపు ఏడ్చి, ఆ తర్వాత మానుకుంది. మొగుడితోబాటు వెళ్ళి ఆ భూమిని చూచింది. దాని నిండా పిచ్చిమొక్కలు, ముళ్ళకంపలు, పెద్ద పెద్ద రాళ్ళు వున్నాయి.

నందినికి నెత్తిమీద రాయి పడ్డట్లయింది. ఈ భూమినంతా వ్యవసాయాని కోసం ఎట్లా బాగు చేయడం? అని ఆమె ఆలోచించింది.

మొగుడితో "నే చేసినట్లు చేయండి" అని, ఆమె వంగి ఆ నేలను దీక్షగా పరిశీలించ సాగింది.

ఛోటూ లాల్ కూడా అట్లాగే చేశాడు. ఈ విధంగా ఇద్దరూ ఆ నేలను పరి శీలిస్తూ ఇటూ అటూ తిరుగుతుండగా ఒక దొంగల గుంపు గుర్రాలమీద అటు వచ్చారు. వాళ్ళిద్దరూ ఏదో వెతుకుతుండడం చూచి ఆ దొంగల నాయకుడు గుర్రం దిగి వచ్చాడు. "ఏమన్నా పోగొట్టుకున్నారా? మీరు వెతుకుతున్న దేమిటి?" అని అడిగాడు.

నందిని నిశ్చేష్టురాలయింది. "అబ్బే ఏమీలేదు! ఏమీలేదు–" అంటూ ఆ దొంగల నాయకుడిని ఆ భూమినుండి దూరంగా తీసుకు వెళ్ళడానికి ప్రయత్నించింది.

దొంగల నాయకుడికి అనుమానం కలిగింది. వాడికి నందిని దేనికోసం వెతుకుతున్నదో కనుక్కోవాలన్న పట్టుదల ఎక్కువయింది. ఆమెను ప్రశ్నలు వేయసాగాడు. అప్పుడామె వాడిని దూరంగా తీసుకు వెళ్ళి మెల్లగా చెప్పింది– "నేనొక రహస్యం చెబుతాను. అది ఎవ్వరితోనూ చెప్పకూడదు. నిన్న మా తాత గారు చనిపోయారు. చనిపోయే ముందు ఆయన నాతో 'మూడు భోషాణాల నిండా బంగారు నాణాలుంచి ఈ పొలంలో పాతి పెట్టాను' అని చెప్పాడు. వాటికోసం వెతుకుతున్నాము. దయచేసి ఈ మాట ఎవ్వరితో చెప్పకు."

దొంగల నాయకుడు ఎవ్వరికీ ఈ రహస్యం చెప్పనని ప్రమాణం చేసి వెళ్ళి

పోయాడు. ఆ వెంటనే ఛోటూలాలూ, నందిని కూడా ఇంటికి బయలుదేరారు. దారి పొడుగునా ఆడుతూ పాడుతూ వచ్చింది నందిని. ఛోటూలాల్‌కు ఆశ్చర్యం కలిగింది.

మరుసటి రోజు దంపతులిద్దరూ ఆ భూమి దగ్గరకు వెళ్ళారు. అది పూర్తిగా మారిపోయి ఉంది. పొలం అంతా బాగా త్రవ్వబడి వుంది. పిచ్చిమొక్కలు, ముళ్ళ కంపలు అన్నీ పీకివేయబడినాయి. రాళ్ళన్నీ తీసి పారవేయబడినాయి. అప్పుడు నందిని ఆనందంతో చప్పట్లు కొట్టింది. "నేను చెప్పిన బంగారపు కథ బాగా పనిచేసింది. ఆ భోషాణాలకోసం, పాపం ఆ దొంగలు కష్టపడి త్రవ్వారు. పొలం అంతా బాగు చేశారు. ఇక మనం వెళ్ళి గోధుమ విత్తనాలు, మొక్కజొన్న విత్తనాలు తెచ్చి నాటితే చాలు" అంది.

నందిని వెళ్ళి ఒక వ్యాపారస్తుడి వద్ద డబ్బు అప్పుగా తీసుకుని, ఆ డబ్బుతో విత్తనాలు కొన్నది. వాటిని పొలంలో నాటారు. ఎరువులు వేశారు. నీరు పెట్టారు. కొన్ని నెలల తర్వాత చక్కగా పెరిగి పైరులనుండి వారికి గోధుమలు, మొక్కజొన్న ధాన్యాలు లభించాయి. ఇప్పుడు వారి కష్టాలు తీరాయి. తిండికేమీ లోటులేదు. పెద్ద ఇల్లు కొన్నారు. నందినికి కావలసిన నగలు, చీరలు కొనగలిగారు. ఆమె సంతోషంగా వుంది.

కాని నందిని తన్ను మోసం చేసింది గనక ఆమెకు ఎట్లాగయినా బుద్ధి చెప్పాలని దొంగల నాయకుడు కాచుకుని వున్నాడు.

ఒక రోజు రాత్రి నందిని, ఛోటూలాల్ భోజనం చేసి పండుకోబోతుండగా దొంగల నాయకుడు నిశ్శబ్దంగా ఇంట్లోకివచ్చి గుడ్డ తెరచాటున దాగుకున్నాడు. ఆ ఎదుటి గోడమీద పడిన అతని నీడను చూచి గుర్తుపట్టింది నందిని. ఆమె ఒక కుండనిండా పగిలిన గాజుముక్కలు, పాతమేకులు నింపింది. దాని పైన మాత్రం బర్ఫీలు కొన్ని పేర్చింది. అప్పుడు మొగుడితో రహస్యంగా: "ఇంకో అయిదు నిముషాల తర్వాత 'మన సొమ్ము అంతా ఎక్కడ పెట్టావు', అని నన్ను గట్టిగా అడగండి" అని చెప్పింది.

కొన్ని నిముషాల తర్వాత ఛోటూలాల్ బయటినుండి పడక గదిలోకి వస్తూ

"మన సొమ్మంతా ఎక్కడ పెట్టావు? జాగ్రత్తగా దాచావా?" అని గట్టిగా అరిచాడు.

"ఆహా జాగ్రత్తగా దాచాను. మీరేమీ చింతించకండి. నేను ఎంతో తెలివిగా దాచివుంచాను. నేను మన సొమ్మునంతా ఒక కుండలోదాచి, దానిపైన బర్ఫీ లుంచాను. ఆ రహస్యం ఎవ్వరూ కనుక్కోలేరు. నిశ్చింతగా నిద్రపోండి" అంది నందిని. ప్రమిదలను ఆర్పివేసి వాళ్ళు పడుకున్నారు.

తెర వెనకాల దొంగల నాయకుడు నవ్వుకున్నాడు. ఈసారి నందినికి బలే ప్రాయశ్చిత్తం జరుగుతుందిలే అనుకున్నాడు. మరో అరగంటలో ఛోటూలాలూ, నందినీ గురకపెట్టి నిద్రపోతున్నారు. అప్పుడు దొంగల నాయకుడు నెమ్మదిగా అడుగుమీద అడుగు వేసుకుంటూ భోజనాల గదిలోకి వెళ్ళాడు. అక్కడ బర్ఫీ కుండ కనుపించింది. దాన్ని అమాంతంగా ఎత్తుకుని దొంగల నాయకుడు బయటికి వెళ్ళిపోయాడు. అడవిలోకి వెళ్ళి తన ముఠా దొంగలందరితో - "ఇదిగో, వాళ్ళ సొమ్మంతా ఇందులో వుంది" అన్నాడు. వెంటనే దొంగ లందరు కుండమీదికి ఎగబడ్డారు. ఆ నగలు, డబ్బు తీసుకోవాలన్న తొందరలో బర్ఫీలన్నిటిని చిందర వందరగా పారవేసి అందరూ కుండ లోపల చేతులు పెట్టి వెతకసాగారు. ఆ కుండలో నగలు లేవుగా! ఆ వున్న గాజులుపెంకులు పాత మేకులు, చేతులకు గ్రుచ్చుకున్నాయి. నెత్తురు కారసాగింది. నగలు లేకపోతే పోయే, బర్ఫీలన్నా తిందామనుకుంటే వాటిని ముందుగా తొందరపడి మట్టిలో పారవేసిరాయె! దొంగలకు బలే కోపం వచ్చింది. నందినికి బాగా శాస్తి చేయాలని తీర్మానించుకున్నారు.

ఒక వారం తర్వాత ఒక సాయంకాలం చీకటి పడుతుండగా నందినికి ఇంటి బయట అడుగుల చప్పుడు వినిపించింది. దొంగల నాయకుడి గొంతు గుసగుస లాడుతుండడం పసిగట్టి నందిని నెమ్మదిగా గోడ చాటుకు వెళ్ళి వినసాగింది. దొంగల నాయకుడు తన వారితో - నందిని వాళ్లింటి పడకగది కిటికీగుండా లోపలికి దూరి, వాళ్ళిద్దరినీ త్రాటిలో కట్టివేసి, వాళ్ళ డబ్బును నగలను ఎట్లా దొంగలించుకు పోవాలో చెబుతున్నాడు. "నందినిని లావుపాటి త్రాడుతో

కష్టిస్తే_ సె. అప్పుడామె మనలను మరచిపోలేదు" అన్నాడు నాయకుడు.

నందిని వంటింట్లోకి వెళ్ళి ఒక పదునైన కత్తిని తెచ్చి, పడక గది కిటికీ ప్రక్కగా నిల్చుంది. కాస్సేపు తర్వాత ఇంటిగోడ మీద ప్రాకివున్న పూలతీగ ఆకులు కదిలాయి. కిటికీగుండా ఒక ముఖం లోపలికి తొంగి చూచింది. తటాలున ఆ ముఖంమీద వున్న ముక్కును కత్తితో కోసి పారేసింది నందిని. వెంటనే ఆ ముఖం మాయమయింది. ఆ దొంగ క్రిందకు దూకి. తన ముఖాన్ని నాయకుడికి చూపించాడు. "చీకట్లో ఏదో రాయికి కొట్టుకున్నావు కాబోలు. నేను వెళ్తా నుండు" అని దొంగల నాయకుడు కిటికీపైకి ఎగబ్రాకాడు. కిటికీలో అతడి ముఖం కనబడగానే నందిని అతడి ముక్కును కోసివేసింది. రక్తం కారుతున్న ముఖంతో క్రిందకు దూకాడు నాయకుడు. నందినికి తగిన శాస్తి చేసేదాకా అన్నం కూడా తిననని శపథం చేసి. తన వారితో సహా అక్కడినుండి వెళ్ళిపోయాడు.

ఎండాకాలం వచ్చింది. రాత్రిళ్ళు నందినీ, ఛోటూలాల్ హాయిగా వెన్నెలలో తోటలో పడుకుని నిద్రపోసాగారు.

ఒక రాత్రి నందినికి తానొక ఒంటెమీద సవారీ చేస్తున్నట్లు కల వచ్చింది. కలలో, ఆమె ముందరి ఒంటె మీద ఛోటూలాల్ కూర్చుని వెళ్తున్నాడు. అప్పుడొక అందమైన యువరాజు తెల్లటి గుర్రం మీద ఎదుటివైపు నుండి వచ్చాడు. అతడు ఒక బంగారు జరీచీరను, కెంపులు పొదిగిన కిరీటాన్ని ఇస్తున్నాడు. వాటిని తీసుకుందామని నందిని చేతులు ముందుకు జాపింది. అంతే! కల ముగిసింది! హఠాత్తుగా మెలకువ వచ్చింది.

నందిని చూచింది. ఆమె ఒంటె మీద వెళ్ళడం లేదు. మంచంతో సహా ఆమె నెత్తుకుని నడుస్తున్నారు దొంగలు. మిగతా దొంగలు ముందు నడుస్తున్నారు. "అయ్యో! ఈ సారి వీళ్ళ చేతుల్లో చిక్కాను. ఇంక చావు తప్పదు కాబోలు- ఏమిటి చేయడం?" అనుకుంది నందిని.

ఓ నిముషం తర్వాత ఆమె మంచాన్ని మోస్తున్న దొంగలలో ఒకడు "ఈమె చాల బరువుగా వుంది. మోసి మోసి నా భుజాలు నొప్పి పెడుతున్నాయి. కాస్సేపు నిద్రపోయి, ఆ ర్వాత మళ్ళీ పోదాము" అన్నాడు. అందుకు అందరూ

ఒప్పుకున్నారు. పెద్ద మర్రిచెట్టుక్రింద మంచాన్ని దింపారు. ఆ చెట్టుకు చేరగిల బడి నిద్రపోసాగారు. నందిని తన పడకమీది గుడ్డలన్నింటిని మనిషిలా చుట్టి ఒక దుప్పటి కప్పింది. అతిమెల్లగా మంచందిగి, మఱ్ఱిచెట్టుపైకి ఎక్కింది. ఆ చెట్టుకొమ్మలు, ఆకులు గుబురుగా వుండడం వలన ఆమె ఎవరి కంటా పడకుండా దాగుకోకల్గింది.

ఆ పైన కూర్చున్నాక ఆమెకో ఉపాయం తట్టింది. తన నల్లశాలువా తీసి ముఖం కప్పేటట్లుగా నెత్తిమీద వేసుకుంది. చేతులను తెల్లటి పొడుగాటి అంగరఖా లోపల దాచుకుంది. వింత వింతగా వికృతంగా అరుపులు అరుస్తూ చేతులను ఆడించసాగింది.

దొంగలు ఉలిక్కిపడి లేచారు. భయంతో చుట్టుప్రక్కల చూచారు. భయంకరమైన కేకలు వినిపిస్తున్నాయి. దొంగలు చెట్టుపైకి చూచారు. అక్కడి నుంచి ఒక నల్ల మొహము, ఆడుతున్న తెల్లటి చేతులూ గల దెయ్యం వాళ్ళవైపు చూస్తూంది. వాళ్ళకు హడలెత్తింది. "బాబోయ్! ఇది ఈ చెట్టుమీద వుండే దెయ్యంరా నాయినా!" అని అరుచుకుంటూ, వెనక్కు చూడనయినా చూడ కుండా ఒకటే పరుగు తీశారు.

నందినికి కడుపు చెక్కలయ్యేట్లు నవ్వు వచ్చింది. "ఇంక బుద్ధి వచ్చింది వెధవలకు - మళ్ళీ రారు" అనుకుంటూ చెట్టు దిగి తమ ఇంటివైపు నడవ సాగింది.

